# శ్రీ అరవిందో జీవిత చరిత్ర



చరణ్ జనమంచి




రచన : చరణ్ జనమంచి

ప్రథమ ముద్రణ : 2012

హక్కులు : రచయితవి

మూల్యం : 50/- రూ

ప్రతులకోసం : శ్రీ సాయి దర్శన్

దమ్మాయిగూడ, హైదరాబాద్ -83

కవర్ డిజైన్ : కె. లక్షణ్ నాయుడు-హైదరాబాద్

డి.టి.పి. : కే.సుధాకర్, లలితానగర్, హైద్రాబాద్

ముద్రణ : శ్రీ సాయి దర్శన్ ప్రింటర్స్

# కృతజ్ఞతలు

చేస్తున్న ప్రయత్నాలన్నింటికి వెన్నంటి ఉండి, నాకు ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని సదా అందిస్తున్న నా కుటుంబానికి,

తనదైన శైలిలో ఈ పుస్తకానికి తగిన డిజైన్, కవర్‌పేజీ రూపొందించిన కె. లక్ష్మణ్ నాయుడికి,

నా మనస్సు, నన్ను అర్ధం చేసుకొని పుస్తకాన్ని డి.టి.పి.చేసిన కే. సుధాకర్‌కి,

మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

నా చేయి విడవకుండా, నాలోని దాగివున్న రచనాశైలిని పెంపొందిస్తూ, నన్ను ఎల్లవేళలా కాపాడుతున్న సమర్ధసద్గురువు శ్రీ షిరిడీ సాయిబాబాను ఆర్తితో వేడుకుంటూ నాచే ఇంకా ఎన్నో ఆధ్యాత్మిక రచనలను చేయించాలని విన్నవించుకుంటూ...

మీ

**చరణ్ జనమంచి**

# రచయిత మాట

తపస్సులా భావించి మొదలుపెట్టిన ఈ పుస్తక రచనలో ఎన్నో అనుభవాలు, అవాంతరాలు ఎదుర్కొన్నాను. ఈశ్వరానుగ్రహం శ్రీ అరవిందుల వారి మీద ఎలా ఉందో, నా వెంట కూడా అలాగే ఉంది.

నాలుగు సంవత్సరాలు ఈ పుస్తక రచన కొనసాగింది. చివరికి శ్రీ అరవిందులవారి ఆశీర్వాదఫలం వల్ల ఈ పుస్తకం తయారైంది.

మానవుని జీవితంలో ఆధ్యాత్మిక యొక్క విశిష్టతను తను పాటించి, మనకు చూపించిన మహాయోగి శ్రీ అరవిందులవారు.

ఏ కార్యమైనా అది కేవలం ఈశ్వరేచ్ఛతోనే జరుగునని ఈశ్వరానుగ్రహం సంపాదించటమే ప్రతి మనిషి జీవిత ధ్యేయంగా పెట్టుకోవాలని చాటిన గొప్ప మహనీయుడు శ్రీ అరవిందులవారు.

తనకు జరిగిన అనుభవాలను పుస్తకరూపంలో పెట్టి 'సావిత్రి'లాంటి రచనలు చేసి, తన జ్ఞానాన్ని, తన ఆలోచనలను, యోగశక్తిని ప్రపంచానికి పంచిన జ్ఞానవేత్త శ్రీ అరవిందులవారు.

జీవితంలో ఉన్నత లక్ష్యాలు, లక్ష్యం కోసం నిరంతరం పాటుపడిన శ్రీ అరవిందుల జీవితం ఎందరికో స్ఫూర్తి నిస్తుంది.

మనిషి తన జీవితంలో ఏ మార్గంలో వెళ్ళాలో, ఏ లక్ష్యం సాధించాలో, ఏ గమ్యంలో ప్రయాణించాలో తెలుసుకోవాలంటే శ్రీ అరవిందుల వారి జీవితం మొత్తం మనకు ఆదర్శంగా నిలుస్తుంది.

గమ్యాన్ని చేరుకోవటంలో పాటించిన నియమాలు, ఎదరైనా చేదు అనుభవాలు, కష్టాలు తట్టుకోవటంలో ఈశ్వరానుగ్రహం కోసం చేసిన ప్రయత్నాలు ముఖ్యంగా శ్రీ అరవిందుల జీవితంలో మనకు కనిపిస్తాయి.

మీరు శ్రీ అరవిందులవారి జీవితాన్ని చదివి, తెలుసుకొని, మీ జీవితంలో ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందాలని కోరుకుంటున్నాను.

అలాంటి శ్రీ అరవిందులవారి జీవితచరిత్ర చదివి, మీ ఆలోచనలో, మీ నడవడిలో, మీరు చేపట్టిన పనిలో మీకు విజయం చేకూరాలని ఆశిస్తూ

మీ

**చరణ్ జనమంచి**

# అంకితం

ప్రియమైన

నా జీవిత భాగస్వామి

శ్రీవాణి కి

# పీఠిక

శ్రీ అరవిందుల పితామహుల గూర్చి ఎవరికి పెద్దగా తెలియదు. వీరు కలకత్తాకు 11 మైళ్ళ దూరంలో ఉన్న హుగ్లీ ప్రాంతంలో భాగీరధీ నదీ తీరములో ఉన్న 'కొన్నగర్' గ్రామవాసులు. శ్రీరామ కృష్ణ పరమహంస, శ్రీ రాజారామోహన్‌రాయ్‌ల జన్మస్థానం కూడా 'కొన్నగర్'. ఇలా చరిత్రలో కొన్నగర్‌కు ఒక ప్రత్యేక స్థానం కలదు.

1840 వ సం॥ కాళీప్రసాద్, కైలాసవాసినీదేవి దంపతులకు పుట్టిన సంతానమే శ్రీకృష్ణధనుఘోష్. ఆచారాలకు కొలువుదీరిన వంశం వారిది. స్వదేశీ సంప్రదాయాలకు, కట్టుబాట్లకు అలవాటు అయినవారు. విదేశీయులైన బ్రిటిష్ వారు మన దేశాన్ని పాలిస్తున్న వారి అలవాట్లు కాని, ఆచారాలకు కాని దూరంగా ఉండేవారు. అంతే కాకుండా వ్యతిరేకులు కూడా.

ఇంచుమించు 1850 వ సం॥ కాలం నుండి మతమార్పిడికి ప్రోత్సహిస్తున్నారు బ్రిటీష్‌వారు. అదే కాలంలో బ్రహ్మసమాజం కొద్ది కొద్దిగా అభివృద్ధికి వస్తున్నది. ప్రజలకు బ్రహ్మసమాజం గూర్చి అవగాహన పరుస్తూ, వారిని బ్రహ్మ సమాజంలో కలుపుకుంటున్నారు ఆసమాజ పెద్దలు. కృష్ణధనుఘోష్‌కు బ్రహ్మ సమాజపు ఉద్దేశాలు, నియమాలు నచ్చాయి. అందుకని బ్రహ్మసమాజం వైపు ఆకర్షితుడైనాడు

కృష్ణధనుఘోష్.

కాళీప్రసాద్, కైలాసవాసినికి కృష్ణధనుఘోష్ చేయుచున్న పనులు, అతని ప్రవర్తన నచ్చలేదు. ఈ కారణం చేత కృష్ణధనుఘోష్ తమ తల్లితండ్రులకు, బంధుమిత్రులకు దూరం అయ్యాడు.

కొన్నాళ్ళకు కృష్ణధనుఘోష్ బ్రహ్మమతమును స్వీకరించి, బ్రహ్మసమాజంలో సభ్యుడైనాడు. ఈ పనివల్ల తనవారందరికి శాశ్వతంగా దూరం అయ్యాడు. అప్పుడు కృష్ణధనుఘోష్ వయస్సు 18 సం॥ కలకత్తా వైద్య విద్యార్థి. బ్రహ్మసమాజంకు చెందిన స్వర్ణలతాదేవిని వివాహం చేసుకున్నాడు. వీరే శ్రీ అరవిందుల తల్లిగారు. బ్రహ్మసమాజ ధర్మాలను అనుసరించి, వారి పద్దతిలో జరిగిన మొదటి పెళ్ళి వీరిదే అని చెపుతుంటారు. వీరి వివాహమును రవీంద్రనాథ్ ఠాగూర్ యొక్క తండ్రి అయిన దేవేంద్రనాథ్ ఠాగూర్ పురోహితునిగా ఉండి జరిపించారు.

కృష్ణధనుఘోష్ పెళ్ళివల్ల కుటుంబానికి దూరం అయిన కారణంగా, తమ సొంత గ్రామంలో ఉండలేక, తన ఆస్తిని ఆఊరిలోనే చాలా తక్కువ మొత్తానికి అమ్మివేసి ఆఊరికి, తల్లితండ్రుల నుండి బంధం తెంచుకొని భార్యతో పట్టణం వచ్చారు.

ఆతర్వాత చదువుకున్న వైద్యవిద్య ద్వారా సబ్ అసిస్టెంట్ సర్జనుగా ఉద్యోగ జీవితం ప్రారంభించాడు. తనకున్న ఆశయాలకు, ఆలోచనలకు అనుగుణంగా విదేశాలకు వెళ్ళి పై చదువులు చదవటానికి కావలసిన డబ్బు సంపాదించాడు. 1869వ సం॥లో పై చదువుల కొరకు విదేశాలకు వెళ్లాడు. ఎం.డి. చదువును చదివి ఉత్తీర్ణుడైనాడు. ఆకాలంలో విదేశాలకు వెళ్ళి చదివినవారు అరుదు అని చెప్పటంలో సందేహం లేదు.

విదేశాలలో చదివిన ప్రభావం వల్లనో, లేక సాంకేతిక, జ్ఞానపరంగా మనదేశంకన్నా విదేశాలు ముందంజలో ఉన్నందు వల్లనో కృష్ణధనుఘోష్‌కు విదేశీ ప్రభావాన్ని చూపాలనుకున్నాడు. అనుకున్నట్లుగానే తమజీవితంలో మార్పును స్వాగతించాడు. అంతేకాక తనతో పాటు, భార్యను కూడా విదేశీ ప్రభావానికి అలవాటు చేశాడు. తనతోపాటు గుర్రపుస్వారీకి ఆమెనుకూడా తీసుకువెళ్ళేవాడు.

స్వర్ణలతాదేవి మంచి సౌందర్యముగల రూపవతి. ఆమెను చూసిన ఎవరైనా బంగారు ముద్దుగుమ్మ అని మెచ్చుకొనేవారు. ఆమె పైపైకి అలా ఉన్న మనసు వెన్నలాంటిది. భారతీయులంటేనే అమెకు ఎక్కువ మక్కువ ఉండేది.

విదేశాలనుంచి స్వదేశంకు వచ్చిన తర్వాత తిరిగి వైద్య జీవితం మళ్ళీ ప్రారంభించాడు. సబ్-అసిస్టెంట్ సర్జనుగా

కలకత్తాలో పని చేయటం మొదలుపెట్టెను. వైద్యునిగా ఎన్నో వైద్యసేవలు చేసేవాడు. బాగాల్‌పూర్, రంగాపూర్, కుణ్నాలో కూడా వైద్యవృత్తి చేసినాడు. 1884 నుండి దాదాపు చివరి దశవరకు కుణ్నాలోనే ఉంటూ ప్రజలకు వైద్యం చేసినాడు. వైద్యరంగంలో ఉన్నతస్థాయిలో మంచిపేరు సంపాదించాడు. అందులో కృష్ణధనుఘోష్ ఫోటోలు ఉంచినారు. అంతగా ప్రజలలో గుర్తింపు పొందినాడు కృష్ణధనుఘోష్. పేద ప్రజలమీద, అనాధలమీద ఎంతో దయనీయంగా ప్రవర్తించేవాడు. సంపాదనలో చాలా వరకు దాన ధర్మాలకై ఖర్చు పెట్టేవాడు. అందుకే కాబోలు విదేశాలలో ఉన్న తన ముగ్గురు కొడుకులకు డబ్బులు పంపించే వాడుకాదు. అంతలా వారు ప్రజలకు ఉచితసేవ చేశారు. అందులో వారి దయ హృదయం కనిపిస్తుంది. కాని కాలం ముందుకు సాగుతున్నపుడు కష్టాలు వారిని చేరాయి. భార్యకు ఉన్న పిచ్చిదనంచే ఆమెతో కలిసి కృష్ణధనుఘోష్ ఉండలేదు. కూతురు, కొడుకులు కూడా ఆయన వెంట ఉండలేదు. చివరిదశలో ఎన్నో కష్టాలు తాను అనుకున్నట్టుగానే ఎదుర్కొనవలసి వచ్చినది. త్రాగుడుకు బానిసగా మారాడు.



శ్రీఅరవిందుల తల్లి - శ్రీమతి స్వర్ణలతాదేవి

కృష్ణధనుఘోష్, స్వర్ణలత దంపతులకు 6గురు సంతానం వారిలో ఐదుగురు కొడుకులు, ఒక కుమార్తె.

మొదటి సంతానం (కొడుకు) - వినయభూషణుడు

రెండో సంతానం (కొడుకు) - మనోమోహనుడు

మూడో సంతానం (కొడుకు) - శ్రీ అరబిందో

నాలుగో సంతానం (కూతురు) - సరోజినిదేవి

ఐదవ సంతానం (కొడుకు) - వారీంద్రుడు

ఒక కొడుకు చిన్నతనంలోనే మరణించాడు.

శ్రీ అరబిందో 15 ఆగస్ట్ 1872, స్వస్తిశ్రీ అంగీరస నామ సం॥ శ్రావణ శుద్ధ ఏకాదశి గురువారం, మూలా నక్షత్రం, సూర్యోదయానికి 24 నిముషాల ముందు జన్మించారు. కలకత్తాలోని ధియేటర్ రోడ్‌లో తన తండ్రి యొక్క స్నేహితులు, నాటి దేశనాయకులలో ప్రసిద్దులు అయిన శ్రీ ఆనందమోహన్ ఘోష్ ఇంట్లో జన్మించారు.

### శ్రీ అరవిందుల లగ్నకుండలి

| | | | |
|---|---|---|---|
| | రా | | |
| | | | ల<br>గు కు |
| | | | ర<br>బు శు |
| శ<br>చ | కే | | |

మొదటి సంతానం - వినయభూషణుడు కుచ్‌బీహార్ రాజ్యములో రాజకుమారులకు ఆచార్యులుగా, సంస్థాన వ్యవస్థాపకునిగా ఎంతో కాలం ఉన్నత పదవిలో ఉండి మంచి పేరు, ప్రతిష్ఠలు సంపాదించాడు.

రెండో సంతానం - మన్‌మోహన్ కలకత్తా రాజధానీ కళాశాలలో ఆంగ్ల భోదకునిగా ఉన్నాడు. ఆంగ్లంలో ఎన్నో రసభరితమైన పద్యములు రచించి కవిగా ఎంతో గుర్తింపు పొందారు.

మూడో సంతానం - శ్రీ అరవిందులవారు

నాలుగవ సంతానం - సరోజినిదేవి ఏకైక పుత్రిక, ఉన్నత చదువు చదివి, తత్త్వజ్ఞానాభిలాషిగా, ఆజన్మ బ్రహ్మచారిణయై, ఆధ్యాత్మిక జీవితమునకు ఇష్టపడి పవిత్ర పుణ్యక్షేత్రమైన కాశీలో

కాలం గడిపినది.

**ఐదవసంతానం** - వారీంద్రుడు విప్లవ బ్రహ్మ అని బిరుదు గావించెంతగా స్వదేశం కోసం పోరాడిన వాడిగా చరిత్రలో స్థానం సంపాదించాడు.

**జోతిష్యం గూర్చి అరవిందుల వారి అభిప్రాయం**

తమ ఆర్య పత్రికలో ఒక జోతిష్య శాస్త్ర గ్రంధమును విమర్శించుచు, తమ జాతక విషయం గూర్చి అరవిందుల వారు ఇలా అన్నారు.

"నా జననము ఇది అని కచ్చితముగా లేదని అయిన కొన్ని ఆశ్చర్యకరమైన విషయాలు ఉన్నా"యని చెప్పినారు.

నేను రాజకీయంలోకి రాకమునుపు పేరు ప్రతిష్టలు గడించకముందు బరోడాలో ఉన్నపుడు, నాపేరు తెలియని ఒక జ్యోతిష్యుడు రాజకీయ సంఘర్షణలో మార్పువల్ల జీవితం ఎన్నో కొత్తమలుపులు తిరిగుతాయని, ప్రాణాపాయ స్థితి కూడా కలుగునని తెలిపెను.

మరోసారి 'వందేమాతరం' అభియోగం నాపై ఉన్నపుడు ఈ జ్యోతిష్యుడే నాపై 3 సార్లు దోషారోపణ వచ్చునని, అయినా కూడా నిర్ధోషిగా నిరూపణ అగునని తెలిపెను.

నా జాతకం చూసి భవిష్యత్తులో జరుగు రెండు సంఘటనలు తెలిపెను. మొదటిది - కారణం లేని వ్యాధితో భాదపడతానని

రెండవది - ఆధ్యాత్మిక తత్త్వంకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తానని. ఇది ఏమాత్రం సంభవంకాదని, జోతిష్యం కేవలం భవిష్యత్‌లో జరుగుదానిని సూచించునే కాని, కచ్చితంగా జరుగునని నిర్ణయించలేదని, దైవాన్ని నమ్మిన యోగులు జోతిష్యం కాని, భౌతిక శాస్త్రం కాని నమ్మరని అరవిందులు వారు తమ ఆర్య పత్రికలో పేర్కొన్నారు.





కలకత్తాలో శ్రీ అరవిందులు జన్మించిన గృహం



చిన్నతనంలో
శ్రీ అరవిందులు





చిన్నతనంలో శ్రీ అరవిందుల సోదరుడు మన్‌మోహన్

1872వ సం॥ నుండి 1877 వరకు శ్రీ అరబిందోవారు రంగ్‌పూర్‌లో ఉన్నారు. అరవిందుల తండ్రి అయిన కృష్ణధనుఘోష్ అక్కడ వైద్యునిగా సేవలు అందిస్తున్నారు. అప్పుడపుడు కుటుంబం అంతా తాత అయిన రాజు నారాయణఘోష్ ఇంటికి వెళ్ళినారు. అరవిందులవారు అపుడు చాలా చిన్నపిల్లవాడు. అరవిందులవారికి బెంగాలి భాష ఎక్కువగా వచ్చేదికాదు. ఇంట్లో ఎక్కువగా ఆంగ్లభాషనే మాట్లాడేవారు.రాజనారాయణ్ ఘోష్ గారికి తమ మనవళ్ళను భారతదేశ ఆచారాల ప్రకారం పెంచాలని, చదువు కూడా భారతదేశంలోనే చదివించాలని తపన. కాని కృష్ణ ధనుఘోష్‌కు భారతదేశపు విద్యార్థుల వలె సామాన్య ప్రభుత్వ పాఠశాలలో చదివించడం ఇష్టం లేదు. విదేశాలలో వారికి మంచి అవకాశాలు లభిస్తాయని, విదేశాలలో చదివించాలని ఆశ కృష్ణధనుఘోష్‌ది.

కృష్ణధనుఘోష్ ముగ్గురు కొడుకులను డార్జిలింగ్‌లో గల లారెట్టె కాన్వెంట్‌లో చేర్పించారు. అప్పుడు 1877వ సం॥ శ్రీ అరవిందులవారికి ఐదు సంవత్సరాలు. అప్పటినుంచే శ్రీ అరవిందులవారు తమ తల్లితండ్రులకు, ఇంటికి దూరంగా ఉండవలసి వచ్చినది. కేవలం సెలవులలో మాత్రమే అన్నదమ్ములు ఇంటికి వచ్చేవారు. ఈ విధంగా శ్రీ

అరవిందులవారికి విద్యాభ్యాసం మొదలు అయింది. ఆ లారెట్టె పాఠశాల అంతా విదేశీయులే, అన్ని పాఠ్యాంశాలు ఆంగ్లంలోనే ఉండేవి. అక్కడ ఎక్కువ విదేశీ వాతావరణమే కనిపించేది. స్కూల్ పాఠశాల జ్ఞాపకాలు కొన్ని శ్రీ అరవిందుల వారు ఇలా చెప్పారు.

1). మా పాఠశాల (డార్జిలింగ్‌లో) పెద్ద పడకగదిలా ఉండేది. పిల్లలందరూ అందులోనే నిద్రించేవారు. మన్‌మోహన్ (రెండో అన్న) తలుపుకు దగ్గరలో పడుకునేవాడు. ఒక రాత్రి ఒక పిల్లవాడు ఆలస్యంగా వచ్చి తలుపు కొట్టాడు. మన్‌మోహన్ ఎంతకూ తలుపు తెరవలేదు. ప్రొద్దున ఆవిషయం గూర్చి పాఠశాల అంతా మాట్లాడుకున్నారు అని అరవిందులవారు చెప్పినారు.

2). సెలవురోజుల్లో తాతగారి దగ్గరికి వెళ్ళినపుడు ఒక రాత్రి పిల్లలతో పాటు తాతగారు కూడా కబుర్లు చెప్పుకంటూ రోడ్డుమీద నడుస్తున్నాము. కొద్దిసేపటి తరువాత చూస్తే తాతయ్య కనిపించలేదు. రోడ్డుమీద నిలుచునే

నిద్రపోతున్నారు.

**3).** మా అమ్మ(స్వర్ణలతా దేవి) ఆరోగ్యపరిస్థితి ఏమి బాగాలేదు. మెదడు పనితీరులో ఏవో మార్పులు వచ్చినవి. పిచ్చిగా ప్రవర్తించేది. ఒకసారి మా అన్నయ్య మన్‌మోహన్‌ను చితకకొట్టింది. నేను (అరవిందులు) ఆ దృశ్యం చూసి ఎంతో భయపడ్డానని తమకు గుర్తుగా ఉన్న ఈ జ్ఞాపకాలను చెప్పినారు అరవిందులవారు.



అరవిందుల అభ్యసించిన - డార్జిలింగ్‌లో గల
లారెట్టొ కాన్వెంట్

# 4. ఇంగ్లాండ్‌లో శ్రీ అరబిందో



కృష్ణధనుఘోష్ అరవిందుల వారికి 7సం॥ ప్రాయంలో సుమారు 1879-80 ప్రాంతంలో తన ముగ్గురు కొడుకులను, కుమార్తెను, గర్భవతిగా ఉన్న భార్యను తీసుకుని పిల్లల చదువుకోసం ఇంగ్లాండ్ వెళ్ళెను. విదేశీ వ్యామోహంగల కృష్ణధనుఘోష్ తన ఒక సంతానం అయినా విదేశాలలో జన్మించాలని కోరుకున్నాడో లేక భార్యకు ఆరోగ్య పరమైన చికిత్సకొరకు విదేశాలకు ఆసమయంలో వెళ్ళారో కృష్ణధనుష్‌కు మాత్రమే తెలిసిన విషయం.

స్వర్ణలతాదేవికి మొదటి సంతానం అయిన తరువాత ఆరోగ్య పరిస్థితి క్షీణించింది. ఎన్నిచికిత్సలు, ఎన్ని మందులు వాడినా ఏమి లాభం కాలేదు. సంతానం పెరిగే కొద్ది వ్యాధి కూడా పెరిగింది. చివరికి ఆ వ్యాధితోనే ఆమె మరణించింది. ఆమె తన చివరి సంతానం వారీంద్రునకు ఇంగ్లాండ్‌లోనే జన్మనిచ్చింది.

వారీంద్రుడు జన్మించినతరువాత, వినయభూషణ్, మన్‌మోహన్, అరవిందులవారిని మాంచెష్టర్ నగరంలో తన స్నేహితుడయిన డ్రూయట్స్ ఇంట్లో వదిలి, భార్య, కూతురు, చిన్నపిల్లవాడైన వారీంద్రుని తీసుకొని తిరిగి భారతదేశం వచ్చాడు.

రంగపూర్‌లో ఉన్నతమైన ఉద్యోగంలో ఉన్న ఆక్రాయిడ్ దొరగారు, కృష్ణమోహన్‌కి ప్రాణమిత్రుడు. ఆక్రాయిడ్‌కు డ్రూయట్ మంచి స్నేహితుడు. అందువల్ల కృష్ణధనుఘోష్ తమ పిల్లలను డ్రూయట్ ఇంట్లో వదిలి వెళ్ళెను.

ఆక్రాయిడ్ దొర ద్వారా వచ్చిన వారు కాబట్టి డ్రూయట్ కుటుంబం తక్కినవారు అరవిందుల వారిని 'అక్రాయిడ్ అరవింద్‌ఘోష్' అని పిలిచేవారు. అరవిందులవారు ఇండియాకు వచ్చిన చాలాకాలం వరకు కూడా ఎ.ఎ.ఘోష్ అను పేరుతో లేఖలు వచ్చేవి.



మాంచెస్టరులో డ్రూయట్ గారి ఇంట్లోనే ఉండి 5 సం॥ (1879-18184) వరకు చదువుకొనెను. అప్పుడు అరవిందుల వారు ఫ్రెంచి భాష నేర్చుకున్నారు. డ్రూయట్ దొర లాటిన్ భాషలో పండితుడు. వారే స్వయంగా అరవిందులవారికి లాటిన్ నేర్పించినారు.

1884-85 ప్రాంతంలో డ్రూయట్ కుటుంబం ఆస్ట్రేలియాకు వెళ్ళవలసి వచ్చెను. అపుడే లండన్‌లో సైంట్‌పాల్ స్కూల్‌లో అరవిందులవారు తమప్రతిభ ద్వారా ఆస్కూల్‌లో ప్రవేశించారు. అక్కడ అందరిని ఆశ్చర్య పరిచే విధంగా చదివి అందరి ఆదరాభిమానాలను సంపాదించారు. అక్టోబర్ 1890 వరకు లండన్‌లోనే ఉన్నారు.

1890లో ఐ.సి.యస్. పరీక్ష రాసి గ్రీక్, లాటిన్, భాషలలో ఇదివరకు ఎవరూ సంపాదించని అత్యధిక మార్కులతో పరీక్ష పాసైయ్యారు. ఐ.సి.యస్. పరీక్ష తర్వాత శిక్షణాభ్యాసం కొరకు కేంబ్రిడ్జి వెళ్ళాడు. కేంబ్రిడ్జిలో కింగ్స్ కళాశాలలో 2సం॥ 1892 వరకు చదివెను. డిగ్రీ పట్టా పొందాడు.

తండ్రి కృష్ణధనుఘోష్ తన వైద్యం ద్వారా వచ్చిన డబ్బులు ఎక్కువగా పేదవారికి సహాయం చేసేవారు. ముగ్గురుకొడుకులకు కొన్ని నెలలు మాత్రమే డబ్బు పంపించాడు. అటుపై అసలు కొడుకులను పట్టించుకోలేదు. డబ్బులు పంపలేదు. ఏ విధమైన సమాచారం వారి మధ్య కొన్ని సం॥ నడువలేదు.

అన్నదమ్ములైన వినయభూషనుడు, అరవిందులవారు, మన్‌మోహన్ తినటానికి, చదువుకొనటానికి, ఇంకా మిగతా ఖర్చులకు డబ్బులు లేక ఎంతో కష్టాలపాలైనారు. ఎన్నోరోజులు పస్తులు కూడా ఉన్నారు. వారివారి ప్రతిభ ద్వారా కొద్దిగా డబ్బులు సంపాదించి విదేశాలలో ఉన్నన్ని రోజలు ఎంతో కష్టంగా జీవితం గడిపినారు.

అరవిందులవారు కళాశాలలో చదువు ఖర్చుకోసం వ్యాసాలు పుస్తకాలు రచించేవారు. ఆ వ్యాసాలు ప్రముఖ రచయిత షేక్స్పియర్- మిల్టన్‌ల మధ్యభేదం వర్ణించేవిధంగా

ఉండేవి.

అరవిందులవారు తన తండ్రి కృష్ణధనుఘోష్‌కు ఈ వ్యాసం తర్వాత జరిగిన విషయం ఒకటి తను క్షేమసమాచారలతో పాటు రాశారు.

“ నాన్నగారు ఇక్కడ అంతా సవ్యంగా జరుగుతున్నది. మీరు క్షేమమని తలుస్తాను. అమ్మ ఆరోగ్యం ఎలా ఉంది. చెల్లి, తమ్ముడు ఎలా ఉన్నారు. నిన్న రాత్రి కాలేజీ లెక్చరర్ నన్ను వారింటికి కాఫీ తాగడానికి ఆహ్వానించారు.వారింట్లో ప్రముఖ కవి ఒకరు బ్రౌనింగ్‌ను నేను చూశాను. నేను రాసిన వ్యాసం చదివారని, దాని గూర్చి నన్ను ఎంతగానే మెచ్చుకొనిరి. నాతోవారు ఇలా అన్నారు. అసాధారణమైన ఈ వ్యాసపోటీలవల్లే నువ్వు విజయం సాధించావని, నీకు ఆ విషయం తెలుసునని నేను భావిస్తున్నాను. నువ్వు రాసినది క్షుణ్ణంగా నేను చదివితిని. నేను ఇంతవరకు ఎపుడూ చూడని, చదవని సాహిత్యం నీది. ఎంతో చక్కగా ఉంది నీ వర్ణన అద్భుతం. నేను ఎంతో గర్వపడుతున్నాను అని నన్ను ప్రశంసించినారు. ఆ తర్వాత నేను ఎక్కడ నివాసముంటున్నానో అడిగారు. నానివాసస్థలం వారికి చెప్పగా అంతటి నీచమైన ప్రాంతంలో ఉంటున్నావా అని ఆశ్చర్యపడి, అధ్యాపకుని వైపు చూసి మన పండితుల పట్ల మనం ఇంత అమర్యాదగా ఉంటున్నామా అని వారిని

అడిగెను."

ఈ లేఖద్వారా నిరూపణ అయినది ఏమిటంటే అరవిందులవారికి ఆంగ్లభాషయందు ఉన్నపట్టు, ఆంగ్లకవుల పొగడ్తలు, అరవిందుల వారి సాహిత్య సంపద, దారిద్ర్యపరిస్థితి మనకూ అర్థమవుతుంది. అరవిందులవారు కేంబ్రిడ్జిలో ఉన్నపుడు వారి భవిష్యత్తు జీవితంలో జరిగే సంఘటనలకు భీజం ఏర్పడినది. 12 సం॥ ఇంగ్లాండ్ దేశంలో స్వేచ్ఛగా ఉన్న అరవిందులవారికి మనదేశ స్వాతంత్రం మీద దాని కోసం జరుగుతున్న పోరాటల గూర్చి తెలుసుకున్నారు.

ఇండియానుండి ఇంగ్లాండ్‌కు చదువుకొరకు వచ్చిన యువకుడు కేంబ్రిడ్జి మజ్లిస్ అను ఒక సంస్థను ప్రారంబించారు. భారతదేశానికి స్వాతంత్ర్యం రావాలని ఆ సంస్థలో ఉన్నవారు గట్టిగా ప్రయత్నిస్తున్నారు. శ్రీ అరవిందులవారు ఆ సంస్థలో చేరిరి. చేరిన కొద్దికాలంలోనే ప్రముఖ పాత్ర వహించే అవకాశం వచ్చింది. కార్యదర్శిగా కొంతకాలం ఉన్నారు. దేశబందు చిత్తరంజన్‌దాస్ విద్యాభ్యాసమునకై ఇంగ్లాండ్ వచ్చెను. అపుడు శ్రీ అరవిందుల వారికి చిత్తరంజన్ దాస్‌లకు పరిచయం ఏర్పడినది.

**1890-91**వ సం॥లో భారతదేశపు పితామహుడని పిలువబడిన దాదబాయినౌరోజి, బ్రిటిష్ పార్లమెంటులో స్థానం

కొరకు ప్రయత్నించెను. ఈ ప్రయత్నంలో భాగంగా భారతీయ యువకులు, అరవిందులవారు, చిత్తరంజన్‌దాస్‌లు నౌరోజికి పరిచయమైరి, బ్రిటిష్ ఎన్నికల కోసం నౌరోజికి భారతీయులు అందరూ ఎంతో ప్రచారం చేశారు. ఎందరో ఆంగ్లేయులను ఆకర్షించినారు. వర్గ భేదంవల్లనో మరే ఇతర కారణాల వల్లనో నౌరోజి బ్రిటిష్ పార్లమెంటులో విజయం సాధించలేకపోయారు. ఈ ప్రచారంలో దాదాబాయిని ఇండియాదేశపు నల్లమనిషి అని నిందించిరి ఇంగ్లాండ్ దేశపు ప్రజలు.

శ్రీ అరవిందులవారు ఐరిస్ దేశీయుల స్వాతంత్ర సమరఘట్టాలు, అందులో ప్రాణాలను కోల్పోయిన చార్లెస్ స్టూవర్టు పార్నెల్ మీద ఒక పద్యం రాసి, తన హృదయ విచారమును వ్యక్తపరిచినారు. అపుడు శ్రీ అరవిందులవారి వయస్సు 18సం॥ మాత్రమే.



శ్రీ అరవిందులవారు ఐ.సి.యస్. పరీక్షకు హాజరు కాలేదు. బ్రిటిష్ ప్రభుత్వం నందు ఉద్యోగం చేయుటకు ఇష్టపడలేదు. కేవలం గుర్రపుస్వారీ పరీక్షకు హాజరు కాక ఐ.సి.యస్.ను వదిలివేశారు. కాని శ్రీ అరవిందులవారిని విమర్శించువారు గుర్రపుస్వారీ పరీక్షలలో ఓడిపోయారని వదంతులు వ్యాపింపచేశారు.

శ్రీఅరవిందులవారు గొప్ప స్థితిలో ఉంటారని, వారితండ్రి ఎన్నో కలలు కన్నాడు. కాని శ్రీ అరవిందులవారు ఐ.సి.యస్. పరీక్షలో విజయం సాధించకపోవటం, వారి తండ్రిని ఎంతో భాదకు గురిచేసింది.

శ్రీ అరవిందులవారు చిన్నతనం నుంచి ఎక్కువగా ఒంటరిగా ఉండటానికి ఇష్టపడేవారు. ఎక్కువగా పుస్తకాలు చదివేవారు. తన వద్ద ఉన్న డబ్బులతో తినటానికి తక్కువ ఖర్చుచేసి మిగతా డబ్బులతో పుస్తకాలు కొనేవారు. భారతదేశపు స్వాతంత్ర్యపు చాయలు మెల్లమెల్లగా శ్రీ అరవిందులవారిలో మొలకెత్తసాగినాయి. స్వాతంత్ర్యపు చరిత్రగల పుస్తకాలు, వ్యాసాలు చదవటం ప్రారంభించారు. ఐరోపాకు సంబంధించిన చరిత్ర, విజ్ఞాన, సాంఘిక సంప్రదాయాల గూర్చి తెలుసు కున్నారు. బ్రిటిష్ పార్లమెంటరీ విధానం, పాలనా పద్దతులు, ఫ్రాన్స్, రోమ్, అమెరికా మొదలగు దేశాల రాజ్యాంగ నిర్మాణ సూత్రాలను, విధానాలను, రాజకీయ పరిమాణాలను పరిశీలించి ఎంతో జ్ఞానం సంపాదించుకున్నాడు.

శ్రీ అరవిందులవారు ఇంగ్లాండ్‌లో ఎన్నో సం॥ ఉన్నాగాని పారిస్‌కు మాత్రం ఎప్పుడూ, ఎన్నడూ వెళ్ళలేదు. పారిస్ నగర్ కళలకు, సంస్కృతికి, సాహిత్యానికి పాలనా విధానమునకు మంచిపేరు గల నగరం. శ్రీ అరవిందులవారు

కనుక పారిస్ నగరం వెళ్ళిఉంటే వారు రచించిన సాహిత్యానికి అది ఎంతో మేలు జరిగిఉండేది.

శ్రీ అరవిందుల తండ్రిగారు డాక్టర్ కృష్ణధనుఘోష్‌కు ధన సంపాదనలో ఏమాత్రం తక్కువ లేదు. అయినా కొన్నివేల మైళ్ళ దూరాన ఉన్న ముగ్గురు కొడుకులకు డబ్బు పంపక వారిని దారిద్ర్యమునకు అలవాటు చేసిరి. కృష్ణధనుఘోష్ కావాలని ధనం పంపలేదో మరే ఇతర కారణాల్లో తెలియవుకాని కొడుకులంటే వారికి ఎంతో ప్రేమ. కృష్ణధనుఘోష్ దయామయుడు, పేదలపాలిటి పెన్నిది. ఎందరో అనాధలకు అశ్రమంలేనివారికి ఉదార స్వభావుడై తన ఆస్థిని వారి కొరకు ఖర్చుపెట్టినాడు. కాని బంధువులు, స్నేహితులు కృష్ణ దనుఘోష్‌ను దుబారామనిషి అని, డబ్బువిలువ తెలియనివారని నానా విధములుగా మాట్లాడుతూ, దూషించుచూ, నిందించెడివారు.



శ్రీ అరవిందులవారు ఎన్నోరోజులు ఉపవాసం ఉన్నారు. ఒంటిపూట భోజనం చేసినరోజులు ఉన్నాయి. అప్పులవారినుండి తీవ్ర వత్తిడిని ఆర్ధిక ఇబ్బందులను ఎన్నో ఎదుర్కొని చదువును కొనసాగించారు అరవిందులవారు. మన్‌మోహన్ విద్యకు కొంత అంతరాయం కలిగినది.

పుండుపై కారం చల్లినట్లుగా భార్యాభాధకు తోడుగా

కొడుకు శ్రీ అరవిందులు ఐ.సి.యస్. డిగ్రీ చదువు మానుట, కృష్ణధనుఘోష్‌ను ఎంతగానో భాదించినది. ఆ భాదలను తట్టుకోలేక మందుకు బానిసగా మారినాడు. శ్రీ అరవిందులవారు భారతదేశంకు స్టీమర్ ద్వారా వస్తున్నానని తండ్రికి లేఖ రాసేను. ఎన్నో సం॥ తర్వాత కొడుకును చూస్తున్న ఆనందం కృష్ణధనుఘోష్, కళ్ళను చూస్తేనే తెలుస్తుంది. కొడుకు వచ్చు స్టీమర్ ఎప్పుడు బొంబాయి వస్తుందో అని స్టీమర్ ఏజంట్ కంపనీ వారిని అడిగి కృష్ణధనుఘోష్ కొడుకు రాకకోసం అతురతతో ఉన్నాడు.

1893వ సం॥ ప్రారంభంలో, అరవిందులవారు భారతదేశంకు వచ్చు 2,3 నెలల ముందే ఆయన (కృష్ణధనుఘోష్) మరణించిరి. ఆరవిందులవారిని, వారి భవిష్యత్తును చూడకనే ఆయనను కాలం మింగివేసింది.

ఇంతకూ అసలు జరిగినది ఏమిటంటే అరవిందుల వారు చివరిక్షణమున తన ప్రయాణం మానుకొన్నారు. ఆ స్టీమర్ కంపనీ ఏజంట్‌వారు కృష్ణధనుఘోష్‌కు స్టీమర్ దారిలో లిస్బన్ సముద్రంలో మునిగిపోయిందని ఆస్టీమర్‌లోనే అరవిందులవారు ఉన్నారని టెలిగ్రామ్ ద్వారా కృష్ణధనుఘోష్‌కు సమాచారం ఇచ్చారు. ఆవార్త కృష్ణధనుఘోష్ మృత్యువుకు మార్గం అయింది. గుఱ్రపుబండి ఎక్కుటలో తొందరపడి

కిందపడెను. ఆ దుఃఖం, ఆ దెబ్బలకు రెండు, మూడు రోజులలో కృష్ణధనుఘోష్ స్వర్గస్తులైరి. అరవిందులు తిరిగి 1893వ సం॥లో అన్ని ప్రయాణపు సౌకర్యాలు చూసుకొని భారతదేశానికి వచ్చారు. వినయభూషనుడు ఎట్లానో కష్టపడి భారతదేశమునకు వచ్చి కుచ్ బీహారులో ఉద్యోగం సంపాదించుకొని, పెద్ద మొత్తం అప్పు తీసుకొని ఇంగ్లాండ్‌లోని తన సోదరులైన మన్‌మోహన్‌కు అరవిందులవారికి పంపెను. అన్నదమ్ములు ఆ డబ్బును అప్పులవారికి ఇచ్చి ఋణవిమోచనులైరి. మన్‌మోహన్ చదువు పూర్తిచేసుకొని ఇండియా వచ్చినట్లు ఓ సమాచారం.





శ్రీ అరవిందులవారు అభ్యసించిన -
సెయింట్ పాల్స్ పాఠశాల



కేంబ్రిడ్జిలోని కింగ్స్ కళాశాల -
శ్రీ అరవిందులవారు ఇక్కడ రెండు సం॥లు చదివినారు



మాంచెస్టర్ నగరంలో దౌలత్ ఇల్లు - శ్రీ అరవిందులవారు తన అన్నదమ్ములతో మొట్టమొదట ఇక్కడనే నివసించారు







కేంబ్రిడ్జ్‌లో శ్రీ అరవిందులవారు నివసించిన గది



సెయింట్‌పాల్ పాఠశాలలో అరవిందులవారు చదివిన తరగతి గది



లండనులో శ్రీ అరవిందులవారు (1890)



లండనులో శ్రీ అరవిందులవారు నివసించిన నివాసము







లండనులో శ్రీ అరవిందులవారు నివసించిన నివాసము
(కేంబ్రిడ్జ్ వద్దనున్న తరువాత శ్రీ అరవిందులవారు
ఇక్కడనే నివసించారు)



చార్లెస్ స్టువర్ట్ పార్నెల్

బరోడా మహారాజుగారు 1892వ సం॥ ఇంగ్లాండ్‌కు వెళ్ళారు. అక్కడ భారతదేశంనుండి చదువుకొరకు వచ్చిన వారిని కలుసుకున్నారు. ఆ సందర్భమున మేధాసంపన్నుడైన శ్రీ అరవిందులవారికి మహారాజ్‌తో అనుబంధం ఏర్పడినది. అప్పుడు అరవిందుల వారికి 21 సం॥ ఈ పరిచయానికి కారకులు సర్‌జెమ్స్ కాటన్ దొరగారు వీరు సర్‌హెనీరీ కాటన్ యొక్క సోదరుడు.

దాదాపుగా 13నుండి 14 సం॥ విదేశాలలో నివాసమున్న అరవిందులవారు 1893వ సం॥ ఫిబ్రవరి, మార్చి నెల మధ్య కాలంలో మహరాజుతో కలసి ఇండియాలోని బరోడాకు వచ్చిరి. మొట్టమొదట రాజుగారికి అంతరంగిక కార్యదర్శిగా ఉన్నారు. అ తర్వాత రెవిన్యూశాఖలో కొంతకాలం, కళాశాలలో ఉపాధ్యాయుడిగా కొంతకాలం కళాశాల ఉపాధ్యక్షులుగా కొంతకాలం శ్రీ అరవిందుల వార పనిచేశారు.

మహారాజు గారు కాశ్మీరు యాత్ర చేసినపుడు అరవిందుల వారిని వెంటతీసుకొని వెళ్ళారు. ఆ సమయంలో అరవిందులవారు అంతరంగిక కార్యదర్శిగా ఉన్నారు. అంతేకాక నైనిటాల్‌లో మహారాజ్‌తో పాటు కొంతకాలం అరవిందులవారు ఉన్నారు. ఒకసారి బాపత్ విషయమై న్యాయవాదుల అభిప్రాయ సేకరణను స్వీకరించి వ్యవహరించు నిమిత్తం మహారాజు వారు

అరవిందుల వారిని మద్రాసుకు పంపిరి. అదే అరవిందులవారికి మొట్టమొదటి సారి దక్షిణ భారతదేశపు యాత్ర.

అరవిందులవారు బరోడాలో ఉధ్యోగం చేస్తున్న సమయమన (1893-1906) అంటే పదమూడు సం॥ భారతదేశ ఉనికిని, చరిత్రను, సంస్కృతిని, భాషలయందు పట్టును సంపాదించిరి. విదేశాలలో ఉన్నపుడు భారతదేశ భాష తెలియదు, కాని తెలుసుకోవాలనే తపన, ఉత్సాహం అరవిందుల వారిలో నిండుగా కనిపించినది.



కళాశాలలో ఉద్యోగం సమయం తప్ప మిగతా సమయం అంతా పుస్తకాలు చదవటము గాని రాయటంగాని చేసేవారు. ఇలా ఒక ప్రక్క భారతదేశ ప్రాచీన సంప్రదాయాలు, చరిత్ర, సంస్కృతి తెలుసుకుంటూ ప్రస్తుత పరిస్థితికి అనుగుణంగా వచ్చిన పుస్తకాలు, రాజకీయ మార్పిడిలు, ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నారు.

బొంబాయి నగరంలో ప్రసిద్ధ పుస్తకాలు విక్రయించే సంస్థతో అనుబంధం పెట్టుకున్నారు అరవిందులవారు. అందులో భాగంగా కొత్త పుస్తకాలు, వ్యాసాలు, గ్రంధాలు ఎప్పటికప్పుడు పుస్తక విక్రయశాల వారు అరవిందుల వారికి బరోడా పంపేవారు. అరవిందుల సంపాదనలో ఎక్కువ శాతం పుస్తకాలు కొన్నడానికి ఖర్చుపెట్టారు. దీనినిబట్టి అరవిందుల

వారికి పుస్తకాల మీద ఉన్న ప్రేమ మనం అర్ధంచేసుకోవచ్చు.

ఇలా ఉంటూనే భారతదేశ రాజకీయ పరిస్థితి, దానిని ఎదుర్కొంటున్న సంస్థలు, దేశనాయకుల గూర్చి విదేశాలనుండి వచ్చిన కొంత కాలమునకు అరవిందులవారు గమనించడం ప్రారంభించారు.

దేశనాయకులు లక్ష్యమును, ప్రతి భారదేశ పౌరుని హక్కులను చాటి చెప్పాలని తపన ఉద్దేశముతో, తన మిత్రుడైన దేశ్‌పాండ్యా నడుపుతున్న "హిందూ ప్రకాశ" అను బొంబాయి వార్తా పత్రికలో 9 వ్యాసాలు రచించి ముద్రించారు.

మొదటి వ్యాసం 1893 ఆగస్ట్ 7వతేదీన ముద్రితమై 1894 మార్చి 9న ముగిసినది. పాత దీపములకు కొత్త దీపములు అను శీర్షిక క్రింద ఈ వ్యాసములు ముద్రితమైనవి. జీరో అను సంతకముతో ఆ వ్యాసముల కింద జీ సంతకం ఉండేది. ఇలా సంతకం తప్పుగా చేయడం వల్ల ఆ వ్యాసాలు రాసినది ఎవరో ఎవరికి తెలిసేదికాదు. కాబట్టి ఆ వ్యాసాలలో ఉన్న విమర్శలకు ఎవరూ ప్రశ్నలు వేశావారుకాదు.

ఆ వ్యాసముల సారాంశము ఇక్కడ తెలియ చేస్తున్నాము. "గ్రుడ్డివానికి గ్రుడ్డివాడు దారి చూపిస్తే ఇద్దరు గోతిలో పడినట్లు అన్న గాలిషియన్ మహాశయుని మాట మన దేశపు మహాసభకు (కాంగ్రెస్‌కు) చక్కగా సరిపోతుంది. కాంగ్రెస్

నేను విమర్శించుట, నిందించుట పలువురికి భాదకల్గించవచ్చు. కాని కాంగ్రెస్ స్థాపించి 9సం॥ అయిన దేశ ప్రజలతో ఐక్యతభావం, సమానత్వం, ఏకత్వం నెలకొల్పుటలో తడబడుతున్నట్లు నాకు తోచుచున్నది. లోపల సహజమే కాని లోపాలు సరిచేసి విదేశీయులకు భారతదేశ స్వాతంత్ర్యం యొక్క అవసరం తెలియచేయాలి. విరోధులైన విదేశీయులకు మన లోపాలు మనలో మనకు అంతర్ కలహాల వల్ల మనపై వారికి భయం లేకుండా చేస్తున్నాయి. ఇలా రాస్తున్నందువల్ల నా మీద చాలా మంది కోపంతో ఉన్నారు. అయినా ఇది యదార్థమని, ఈ సత్యాన్ని ప్రజలు గుర్తించాలనేది నా యొక్క ఆకాంక్ష. అందుకు నేను చేస్తున్న ప్రయత్నం ఇది.

చాలా ఘాటుగా, సూటిగా కాంగ్రెస్‌ను తీవ్రంగా విమర్శిస్తున్న వ్యాసములు పూర్తిగాక మధ్యలో ఆగిపోయినవి. కాని ఈ 9 వ్యాసములకే దేశంలోని యువకులలో అలజడి, కలకలం ఏర్పడినది. ప్రజలకు కాంగ్రెస్ మీద అందులో ఉన్న నాయకులమీద ఉన్న నమ్మకం, విశ్వాసం తగ్గిపోయినవి. నాయకులకు ఈ వ్యాసము ఎవరు రాస్తున్నారో సరిగ్గా తెలియటంలేదు. ఈ వ్యాసాలు రాసిన వారిమీద కేసు పెట్టెదమని ఎందరో ప్రముఖులు, ప్రభుత్వోద్యోగులు, పత్రికా సంపాదకుణ్ణి బెదిరించిరి.కాని ఈ వ్యాసాలు రాసినది ఎవరని

తెలియక వారిలో వివాదం, విషాదం అలముకున్నాయి.

ప్రముఖ న్యాయధిపతి శ్రీ గోవింద మహాదేవ రానడేగారు శ్రీ అరవిందులవారు ఈ వ్యాసాలు రాస్తున్నారని తెలుసుకొనెను. ఉభయులకు మిత్రులైన వారి ద్వారా శ్రీ అరవిందులవారిని తమ వద్దకు పిలిపంచుకొని కాంగ్రెస్ మీద చేస్తున్న విమర్శనాత్మక వర్షాన్ని ఆపమని అరవిందులవారికి అన్ని విధాల నచ్చచెప్పిరి.

ఇలాంటి విమర్శనాత్మకమైన వ్యాసాలు రాయటం మానుకొని భారతదేశ నూతన నిర్మాణ కార్యాలకు తమ తెలివితేటలను, శక్తి సామర్థ్యాలను వినియోగించమని అందుకు కావలసిన ఏర్పాటులను తానే (రానడే) సహాయం చేస్తానని అరవిందులవారితో రానడే అనెను. దేశ్‌పాండ్య కూడా అరవిందులవారితో విమర్శల ఘాటుతనాన్ని కొద్దిగా తగ్గించమని వేడుకొనెను. అంతటితో విమర్శ వ్యాసములకు తెరపడినది.

1909లో అరవిందులవారు జైలునుండి వచ్చిన తరువాత జైలు జీవితం గూర్చి వివరిస్తూ శ్రీరానడేగారు నాడు చెప్పిన విషయములను ఈ విధంగా అరవిందులవారు రాశారు.

“ నాడు శ్రీరానడేగారు కోరిన కారాగృహ సంస్కరణ విధానం నేడు నేను అనుభవపూర్వకముగా గ్రహిస్తానని

అనుకోలేదు. నేను కాంగ్రెస్ గూర్చి చేసిన విమర్శలకు వారు (శ్రీరానడే) ఇచ్చిన సమాధానాలు నన్ను తృప్తిపరచలేదు. నా వాదన తప్పు అని గాని, ఒప్పు అని గాని వారు నిరూపించలేదు. అయిన శ్రీరానడే గారు వృద్ధులు గొప్పవారు, అంతగా బ్రతిమాలినందుకు నేను తిరిగి వ్యాసములు వ్రాసి వారిని నొప్పించుట సరిఅయినది కాదని నేను అంతటితో వాటికి స్వస్తి పలికాను''.

శ్రీ అరవిందులవారు 22 సం॥ కూడా నిండని ప్రాయంలో దేశ మహాసభను, నాయకులగు మెహతా, బెనర్జి మొ॥ వారిని గూర్చి బహిరంగంగా విమర్శించుట వారి సాహసమును తెలియచేస్తుంది.



బరోడా రాజుగారు తన సంస్థానములో ఇతర ఉద్యోగస్తులను ఎలా చూసినా, శ్రీ అరవిందులవారిని మాత్రం చాలా జాగ్రత్తగా పట్టించుకునేవారు. రాజ్యపాలనకు సంబంధంలేని విద్యాశాఖలో అరవిందులవారు ఉద్యోగం చేస్తున్నా, శ్రీ అరవిందులవారి ప్రతిభా సామర్థ్యాలు తెలిసిన మహారాజు తన రాజ్యపరిపాలనకు సంబంధమైన విషయములు చర్చించేవారు.

ప్రభుత్వనివేదికను, ముఖ్యమైన పత్రములను, రాజుగారు చెప్పవలసిన ఉపన్యాసము తయారుచేయుటకు

అరవిందులవారి సహాయం రాజుగారు అడిగేవారు. ఒక్కొక్కసారి రాజుగారే స్వయంగా అరవిందులవారి ఇంటికి వచ్చిన రోజులు ఎన్నో ఉన్నాయి.

శ్రీ అరవిందుల నివాసముండే ఇల్లు చీకటిగా చిన్నదిగా ఉండేది. శ్రీ అరవిందులవారు ఒకరు మాత్రమే ఆ ఇంట్లో ఉండేవారు. శ్రీ అరవిందులవారు ఎక్కువగా పంచెను ధరించేవారు.

అంతేకాక రాజ మందిరములో జరుగు ఎన్నో కార్యములకు, పార్టీలకు భోజనాలకు అరవిందలవారిని ప్రతిసారి రాజుగారు ఆహ్వానించేవారు. కాని అరవిందులవారు చాలా తక్కువగా అక్కడికి వెళ్ళేవారు.

బరోడా మహారాజు పట్ల అరవిందుల అభిమానాలుఎట్లా ఉన్నాయో ఈ క్రింది వాక్యాలు వివరిస్తున్నారు.

"మహారాజుగారి అంతటి శక్తి సామర్థ్యములు, రాజకీయ పరిజ్ఞానం, పరిపాలన విధానంగల మహారాజు మరొకరు ఈ దేశములో కనపడరు. వీరు ఒక్క బరోడా రాజ్యం కాక, భారతేశమును పాలించు సమర్థులు అని తన అభిమానాన్ని చాటి చెప్పిన శ్రీ అరవిందులవారు".

విదేశాలలో గడిపిన అనుభవం వల్ల అరవిందులవారు చాలా ఆలస్యముగా నిద్రలేచేవారు. కాని రాత్రి పూట అందరూ

నిద్రించిన అరవిందులవారు ఏకాంతముగా పుస్తకాలు చదవటం, వ్రాయటం చేసేవారు. ఆకాలంలో తన సొంత రాష్ట్రం యొక్క భాష అంటే (బెంగాలీ) నేర్చుకొనుటకు కలకత్తానుండి శ్రీ దినేంద్ర కుమార్ రాయ్ అను వారిని అరవిందులవారు బరోడాకు పిలిపించుకున్నారు. శ్రీ అరవిందులు దినేంద్ర వద్దనుండి బెంగాలీ ఎక్కువగా నేర్చుకోలేదు. సరికదా దినేంద్రకు ఫ్రెంచ్, జర్మనీ భాషలు నేర్పించిరని దినేంద్రరాయ్‌గారు చెప్పినారు.

దినేంద్రరాయ్ అరవిందుల జీవిత విశేషాలను, బరోడా జీవితమును బెంగాలీ భాషలో శ్రీ అరవిందుల ప్రసంగం అను గ్రంధం రచించెను. రాయ్ గారు రచించిన గ్రంధం నుండి కొన్ని విశేషములు క్రింది వివరించడమైనది.



"అరవిందులవారికి ధనమందు ఆశలేదు. దానికొరకు ఎన్నడూ ప్రయత్నించలేదు. అరవిందులవారికి ఎటువంటి పోకడలు, భోగ విలాసములు లేవు. ఎప్పుడూ విలువైన, ఖరీదైన వస్త్రాలు ధరించలేదు. దేశంలో తాయారు అయిన మామూలు చెప్పులు, అహమ్మదాబాదు మిల్లు దోవతులు, బరోడాలో వాడుతున్న నాటు టోపీలు వాడుతుండేవారు.



బరోడా మహారాజ్



బరోడా కళాశాల (ఇక్కడనే శ్రీ అరవిందులవారు ఉపాధ్యాయులుగా పనిచేశారు)




శ్రీ అరవిందులవారు
ఉపయోగించిన గది



బరోడాలో శ్రీ
అరవిందులవారు
నివసించిన గృహం





బరోడా కళాశాలలో శ్రీ
అరవిందులవారు



బరోడాకళాశాలలో
విద్యార్థులతో
శ్రీ
అరవిందులవారు



సిస్టర్ నివేదిత



బరోడాలో శ్రీ అరవిందులవారు
నివసించిన వసతి గృహం



బరోడా కళాశాలలో శ్రీ
అరవిందుల వారి గది







1893లో శ్రీ అరవిందులవారు





బరోడాలో 1908వ
సం॥లో శ్రీ
అరవిందులవారు





బరోడాలో కాశీరావు జగ్‌హవ్ గృహం





ఉపాధ్యాయునిగా శ్రీ అరవిందులవారు





అపోలో బందర్ - ఇక్కడనే శ్రీ అరవిందులు తొలిసారిగా
కాలిడిన పుణ్యభూమి



1903లో కాశ్మీరుయాత్రలో శ్రీ అరవిందులవారు





1908వ సం॥లో అమరావతిలో గల ఇంద్రభువన్‌లో ఇక్కడనే
శ్రీ అరవిందులవారు ఉపన్యసించిన వేదిక

బరోడాలో ఉద్యోగంలో చేరిన 8సం॥ తన 29వ యేట 1901వ సం॥ ఏప్రిల్ నెలలో అరవిందులవారు మృగాళినీదేవిని పెళ్ళి చేసుకొని సంసార భాధ్యతను స్వీకరించెను. ఆ సమయములో ఆధ్యాత్మిక ధోరణిలో ఉన్న అరవిందులవారు పెళ్ళి చేసుకోవాలో లేదో నిర్ణయం తీసుకోకపోవటం వల్ల అంత ఆలస్యంగా పెళ్ళిచేసుకున్నారని చెప్పవచ్చును.

పెళ్ళి జరుగుటకు రెండు మూడు సం॥ కిందనే పెళ్ళి చేసుకొనుటకు వధువుకావలెను అని అరవిందులవారు 'ఉద్బోధన్' అను బెంగాలీ పత్రికలో ప్రకటన ఇచ్చిరి. గిరీష్ చంద్రబోస్ (కలకత్తానివాసి) కళాశాల అధ్యక్షులు శ్రీ అరవిందులవారి పెళ్ళికి శ్రీకారం చుట్టారు. గిరీష్ వారింటికి వచ్చి మృగాళిని చూసి పెళ్ళిచేసుకునుటకు అంగీకరించిరి. పెళ్ళి హిందూ సంప్రదాయంగా జరిగింది. పెళ్ళికి వచ్చిన వారిలో ప్రముఖులు గిరీష్ చంద్రబోస్, సిన్హా ప్రభువు, హ్యామకేశ చక్రవర్తి, సర్‌జగదీశ చంద్రబోస్ మొదలగువారు ఉన్నారు. కలకత్తాలో వైతాక్ ఖానా రోడ్డులో ఒక ఇంటిలో పెళ్ళి జరిగింది. అప్పటికి మృణాళినికి 14 సం॥ నిండి 15వ సం॥ అడుగుపెట్టింది. ఆమె పుట్టినది 1887 మార్చి 6వ తేది.

పెళ్ళి అయిన తరువాత అరవిందులవారు సతీసమేతముగా బరోడాకు వెళ్ళారు. అరవిందులవారి

మామగారి కుటుంబం కూడా మంచి పేరు ప్రతిష్టలు ఉన్నదే. అరవిందుల మామగారు భూపాలబోస్ ఆకాలములో విదేశములలో చదివి 16వందల జీతం ప్రభుత్వం నందు ఉన్నత స్ధాయిలో ఉధ్యోగం చేశారు. రాయ్ బహదూర్ అనే బిరుదు కూడా వారికి వచ్చింది.

చెల్లెలు సరోజనిదేవిని కూడా బరోడాకు పిలిపించుకొని తన వద్దనే ఉంచుకున్నారు అరవిందులవారు. మృణాళిని దేవి బ్రహ్మసమాజపు కుటుంబలో జన్మించినది. లౌక్యం తెలియని అమాయకురాలు, మంచి వినయ విధేయుతలు గల సౌందర్యవతి.



శ్రీ అరవిందులవారితో సంసార జీవితం తక్కువగా గడిపిన ఉన్నంతకాలం ఎంతో అన్యోన్యంగా కాలం గడిపినారని తెలుస్తోంది. శ్రీఅరవిందులవారికి భార్యపై ఉన్న ప్రేమ ఎలాంటిదో అరవిందులవారు మృణాళినికి రాసిన లేఖను చూస్తే తెలుస్తుంది.

**వాటిలో కొన్ని ఇక్కడ తెలియపరుస్తున్నాము.**

1. అనేక రోజులనుండి ఉత్తరం వ్రాయలేదు. అది ముమ్మాటికి నా తప్పే. అందుకు నీ మంచితనం చేత నన్ను క్షమించకపోతే నాకు ఇక ఉపాయం ఏమి లేదు.

2. నిన్ను వదిలిపెట్టి నా పనులు నేను చూసికొనుచున్నానని

నువ్వు అనుకొనగలవు. కాని అలా అనుకోవద్దు.

3. అన్ని దిక్కులనుండి ఒత్తిడి ఈ సమయములో నువ్వు భాదపడుటవల్ల నేను చేయుచున్న పనులలో ఉత్సాహం ధైర్యం తగ్గిపోవుతున్నాయి. నువ్వు ధైర్యమైన మాటలతో నాకు ఉత్తరం వ్రాసినచో అవి నాకు మిక్కిలి బలాన్ని ఇస్తాయి. ఆ ధైర్యంతో అన్ని విపత్తులను, భయంను ఎదుర్కోనినవాడిని అవుతాను. దేవఘరులో నువ్వు ఒంటరిగా ఉండుట నీకు కష్టమని తెలుసు. అయిన మనస్సును గట్టి చేసుకొని విశ్వాసంతో ఉండు. ఎటువంటి దూఖాన్ని మనసులో పెట్టుకోవద్దు. ఎప్పుడూ నాతో నీ పెళ్ళి అయినదో అప్పుడే నీకు నా దుఖంలో పాలుపంచుకునే అర్హత ఉన్నట్టు. ఈ ఎడబాటు తప్పదు. ఎందుకంటే నేను సాధారణ బెంగాలీ మనిషిలాగా కుటుంబ భాద్యత స్వార్ధ ప్రయోజనములను ముఖ్యమని తలవని వాణ్ణి. ఇలాంటి పరిస్థితిలో నాధర్మమే నీధర్మము. నేను నిర్వహించు కార్యంలో విజయమే నీ సుఖంగా భావించు. నీకు మరో మార్గంలేదు.

ఎవరితో నువ్వు ఇప్పుడు ఉన్నావో వారు కూడా నీకు గురుజనులు. వారు అసభ్యంగా మాట్లాడినా, అన్యాయంగా ప్రవర్తించినా వాళ్ళ పై కోపం వద్దు. అంతేకాక వారి నోటినుంచి వచ్చిన మాటలు హృదయంలోని మాటలు కాదు, పైపైన మాటలు మాత్రమే నిన్ను కష్టపెట్టుట కొరకు పలికినవి కాదని

తెలుసుకో, కోపం యొక్క వేగాన్ని తగ్గించుకో వాటిని పదేపదే తలచుట మంచిదికాదు.

**4.** వెర్రివానిని పెళ్ళిచేసుకొని వెర్రివానికి అనుగుణంగా వెర్రిదానివలే అగుటకు ప్రయత్నం చేయుదవా లేక చెప్పిన బాటలో ప్రయాణిస్తావో నీఇష్టం.

**5.** భార్య భర్తయొక్కశక్తి. నువ్వు ఉషయొక్క శిష్యురాలవై దొరల పూజా మంత్రములను జపం చేయుదవా? ఉదాసీనురాలవై భర్తయొక్క శక్తిని పెంపొందిస్తావా! లేక సానుభూతితో ఉత్సాహంగా ద్విగుణం చేయుదవా! నువ్వు అడుగవచ్చు ఈ గొప్ప పనులన్నింటిలో నా వంటి సామాన్యులు ఏమి చేయగలరు. నాకు మనోబలం లేదు. ఈ విషయం తలచుకంటేనే భయం అని దేనికి ఒకే ఒక ఉపాయం అది భగవంతుని ఆశ్రయం పొందు. భగవంతుడు మన భయాన్ని క్రమ క్రమంగా తగ్గిస్తాడు. అంతేకాక నాపై విశ్వాసం ఉంచు. పదిమంది మాటలు వినకు, నా మాటలనే వినుము. అపుడు నేను నీకు బలం ఇవ్వగలను. అందువల్ల నాబలం కూడా పెరుగుతుంది.

నేను మంచి బట్టలను కట్టుదును, మంచి ఆహారం భుజించెదను, నవ్వుదును, ఆడెదను, సుఖాలలో మునిగి తేలుదును, అని ఎల్లపుడూ ఈభావంలోనే ఉంటావా? ఈ

స్థితిని ఉన్నత స్థితి అని అనరు. ఈ కాలంలో స్త్రీల జీవితం, జీవనం, ఎంతో కఠినంగా ఉన్నది. నువ్వు అన్ని వదిలిపెట్టి నాతో ఉండుము, రమ్మ్మ, భగవంతుని వేడుటకు మనం ఇద్దరం ప్రారంభిద్దాము.

బరోడాలో అరవిందులవారు ఉద్యోగం చేయునపుడు ఎందరో వారిని కలసి వారితో మాట్లాడాలని కుతూహల పడినవారు ఉన్నారు. అరవిందులవారితో సంభాషించుట గౌరవ ప్రదంగా అదృష్టంగా భావించేవారు. దేశ్‌పాండ్యాగారు లండన్ నగరంలో విద్యార్థిగా ఉన్నపుడే అరవిందులవారికి పరిచయం. అంతేకాక స్వామి వివేకానందులవారి శిష్యులలో ఒకరు సోదరి నివేదిత అరవిందులవారి వద్దకు వచ్చేవారు. అరవిందుల వారు మితభాషి. ఎక్కువగా, వ్యర్థ సంభాషణలు చేయరు అని నివేదిత తెలియచేశారు. బరోడాలో అరవిందుల వారు 13వ సం॥ మహారాజు యొక్క మన్ననలు పొందిన ఏకైక ఉధ్యోగి శ్రీ అరవిందులవారు మాత్రమే. శ్రీ బరోడా మహారాజు 1933లో స్వర్గస్తులైనారు.

అరవిందుల వారికి హైందవ సంబంధమైన తాత్విక పరిచయమునకు కారణము రామకృష్ణపరమహంస యొక్క వాక్యామృతమలు వివేకానందస్వామి రచనలు, ఉపన్యాసములు అని చెప్పవచ్చును. రామకృష్ణ పరమహంస మీద

అరవిందులవారికి అభిమానం ఎక్కువ. వివేకానందుల వారిని ఎక్కువగా మెచ్చుకునేవారు కాని వివేకానంద స్వామి లక్ష్యం, తత్త్వం, ఆదర్శాలు అరవిందులవారికి అంతగా నచ్చలేదు.

దేశ్‌పాండ్యాగారు యోగసాధన చేయమని అరవిందుల వారిని అడిగెను, కాని ఆమాటలను అరవిందులవారు పట్టించుకోలేదు. అంతేకాక యోగసాధన మనల్ని నిత్యజీవితం నుండి ఒంటరిగా చేస్తుందని భావించేవారు. కాని రానురాను కాలం గడుస్తున్నకొద్దీ నిజమైన సాధు పుంగవులను, తపోధనులను యోగీశ్వరులను దర్శించి యోగ రహస్యములను తెలుసుకోవాలనే కుతూహలం అరవిందులవారిలో పెరిగింది. పలుమార్లు నర్మదా తీరమున ఉన్న బ్రహ్మానంద స్వామి వారిని దర్శించుటకు దేశ్‌పాండ్యా వేళ్ళేవారు. బ్రహ్మానందస్వామి వయస్సు తెలియదు, వారి మహత్యం అధ్భుతం అని ఇంకా అరవిందులవారు బ్రహ్మానందస్వామి గూర్చి ఇట్లా చెప్పినారు.

బ్రహ్మానందస్వామి ఉన్న ప్రదేశాన్ని 'చందోట్' ఆశ్రమం అంటారు. ఒక సాయం కాలం నేను (అరవిందులు) అక్కడికి వెళ్ళాము. ఒక మనిషి తీవ్ర జ్వరంతో భాదపడుతున్నాడు. బ్రహ్మానందస్వామి తన శిష్యుడగు కేశవానందుని పిలిచి మందు తెమ్మనెను. కేశవానందుల వారు ప్రవహించుచున్న నర్మదా నది నీరుని ఒక గిన్నెలో తెచ్చి రోగికి ఇచ్చెను. వెంటనే ఆరోగి

జ్వరం తగ్గిపోయింది. స్వామివారు నిరంతరం ఆధ్యాత్మిక ఆనందంలో మునిగి ఉంటారని చాలా తక్కువగా మాట్లాడుతారని మాట్లాడినపుడు తలపైకి ఎత్తకుండానే మాట్లాడుతారని అందరికి తెలిసిన విషయమే. తలపైకి ఎత్తుట చాలా అరుదు అని స్వామి శిష్యులు చెప్పినారు. అలాంటి స్వామి శ్రీ అరవిందులవారి స్వామి దర్శనానికి వచ్చినపుడు శ్రీ అరవిందులవారిని తదేక దృష్టితో చూశారని, ఆ ప్రభావం వల్లనే అరవిందులవారిలో ఆధ్యాత్మికత యందు ఇష్టం కలిగిందని కొంత వరకు చెప్పవచ్చును.

అరవిందులవారికి రాజకీయమందు విద్యార్థిగా ఉన్నపుడే ప్రవేశం కలదు. కాని **1902**వ సం॥ బరోడాలో ఉన్నపుడు అది స్పష్టంగా కనిపించింది. ఉద్యోగములో ఉన్నకారణంగా ప్రత్యక్షంగా రాజకీయ సభావేదికలపై ఎక్కి మాట్లాడి ప్రజలలో చైతన్యం కలుగజెయ్యాలని అనుకునేవారు కాని ఆమహాసభలకు ప్రేక్షకునిగా, ఒక భారతదేశ పౌరునిగా మాత్రమే వెళ్ళేవారు. సెలవురోజులలో కలకత్తా వెళ్ళి అక్కడి రాజకీయ నాయకులను కలిసేవారు, అక్కడి రాజకీయ పరిస్థితిని ఎప్పటికప్పుడు అర్థం చేసుకునేవారు.

**1905** ఆగస్ట్ **30**వ తేది శ్రీ అరవిందులవారు బరోడానుండి తమ ధర్మపత్ని మృణాళిని దేవికి రాసిన లేఖ

**ప్రియమైన మృణాళిని నాకు మూడు కోరికలు గలవు.** **మొదటిది-** భగవంతుడు ఏ గుణమును, ప్రతిభను, విద్యను, ధనంను ఇచ్చాడో అది అంతయు భగవంతునిదే. ఎంత సంసారమునకు ఖర్చు అగునో, ఎంత అవసరములకు వాడుకోవాలో అంత డబ్బు మాత్రమే ఖర్చుపెట్టాలని, మిగిలినది భగవంతునికే తిరిగి ఇవ్వాలని నాదృఢ విశ్వాసం. నేను నా కొరకు, నాసుఖం కొరకు ఖర్చుపెట్టుకున్నచో దొంగను అవుతాను. హిందూశాస్త్రం ఈవిధంగా చెప్పుచున్నది. ఎప్పుడు భగవంతుని నుండి ధనమును తీసుకొని భగవంతునికి ఇవ్వడో అతడు దొంగ అని నా అభిప్రాయం. ఇంత వరకు భగవంతునికి రెండు అణాలు ఇచ్చి 14 అణాలు స్వప్రయోజనం కొరకు ఖర్చు చేసుకొంటినని లెక్కలు సరిపెట్టిన మాయలో ఉన్నాను. జీవితంలో సగం జీవితం వృధాగా గడిచింది.

అది తెలుసుకున్నాక నాపై నాకు అసహ్యాభావన కల్గింది. ఇకచాలు ఆ పాపాన్ని ఈ జన్మలో ఇక ముందు చెయ్యను. భగవంతునికి ఇచ్చుట అంటే ధర్మకార్యములకు వ్యయం చేయుట. ఇతరులకొరకు ఖర్చు చేసిన ధనం పరోపకారం కొరకు మాత్రమే. అన్నలకు, అక్క చెల్లెళ్లకు కుటుంబమునకు ఖర్చుచేస్తే సరిపోదు. నాకు 30కోట్ల సోదరసోదరీమణులు ఈదేశంలో ఉన్నారు. వారిలో

అనేకమంది తిండిలేక చచ్చిపోతున్నారు. ఎన్నోకష్టాలను ఎదుర్కొంటున్నారు. ఎంతో దుఖంతో జీవితం సాగిస్తున్నారు. వారందరికి మంచి చెయ్యాలి.

**2వ కోరిక** - ఈ కోరిక ఇప్పుడే తెలిసింది. ఏదోరకంగా భగవంతుని సాక్షాత్కారించుకోవాలి. నేడు ఈ కాలంలో భగవంతుని మత దృష్టితో చూచుట ఎంతో దుర్లభము, నాకు ఏమాత్రం ఇష్టం లేదు. ఈశ్వరుణ్ణి సాక్షాత్కరించుటకు ఏదో ఒక బాట కావాలి. ఆబాట ఎంతో కష్టం, కఠినం దానిగుండా ప్రయాణించాలనే ధృడ సంకల్పం చేసుకున్నాను. హిందూ ధర్మం ఇలా చెప్పుతున్నది. "నిజశరీరం నందు నిజమైన మార్గం కలదు. ఆమార్గంలో నడుచుటకు నియమములను కూడా చెప్పుతున్నది. చూపుతున్నది. ఆవిషయాలని తెలుసుకొనుటకు ప్రారంభించితిని.

**3వ కోరిక** -చాలామంది ప్రజలు దేశాన్ని ఒక జడ పదార్ధంగా, కొన్ని క్షేత్రములుగా, వనములుగా, పర్వతాలుగా, నదులుగా తలచుచున్నారు.

నేను దేశమును తల్లిగా తలుస్తాను, పూజిస్తానుకూడా. తల్లి యదపై రాక్షసుడు రక్తం చిందిస్తుంటే నేను ప్రశాంతంగా ఏమైన వేరే ఆలోచనలు నాకు వచ్చునా? గుండె భారంతో బరువైంది. తల్లిని రక్షించుట కొరకు వరుగులు

మొదలుపెట్టాను. ఈ జాతిని ఉద్దరించడానికి బలం నా వద్దఉంది. ఆబలం ఈ నాయొక్క శరీరం కాదు, కత్తి, తుపాకులతో యుద్ధం చెయ్యను. జ్ఞానబలంతో పోరాటం మొదలుపెడతాను. భగవంతుడే ఈ మహాకార్యం, లోక కళ్యాణంచేయుటకు నన్ను ఈ భూమిపైకి తీసుకువచ్చాడు అది పూర్తి చెయ్యటమే నావిధి.



శ్రీ అరవిందులవారి సతీమణి మృణాళిని



శ్రీ అరవిందులవారి చెల్లెలు సరోజినీ దేవి



శ్రీ అరవిందులవారు తమ చెల్లెలు, సతీమణితో 1908 ఏప్రియల్‌లో నివసించిన గృహం





నైనితాల్‌లో 1901లో శ్రీ అరవిందులవారు తమ సతీమణితో నివసించిన గృహం

1905 అక్టోబర్ 16వ తేది బెంగాల్ రాష్ట్రం విభజన శాసనమై అమలులోకి వచ్చినది. ఈ విభజనను రద్దు చెయ్యాలని కంకణం కట్టుకున్నాను. ప్రజలు తమ వ్యతిరేక అభిప్రాయాలను అనేక విధములుగా వెల్లడిస్తున్నారు. ప్రభుత్వం అందుకు తగ్గవిధంగా శాసనములను ప్రయోగిస్తున్నారు. ఆ పరిస్థితులను స్వయంగా పరిశీలించటానికి అరవిందులవారు బెంగాలు రాష్ట్రంకు వచ్చారు. ప్రజలు విభజన అంగీకరించు టకు సిద్ధంగాలేరు.

1905వ సం॥ గోపాలకృష్ణ గోఖలే అదికారమున కాశీ నగరంలో దేశమహాసభ నిర్వహించిరి. అందు సభలో ప్రభుత్వపు చర్యలను ఖండిస్తూ బెంగాల్ రాష్ట్ర విభజన అన్యాయమని అది బహిష్కరిస్తామని ఏకగ్రీవంగా అందరూ దానిని ఆమోదించారు. ఆసభలో వందేమాతరం అనే స్వరం ఆకాశాన్ని తాకేలా ప్రజలు తమ గొంతుతో ఎలుగెత్తిచాటారు.

1906వ సం॥ మార్చిలో జరిగిన మరో సభ సమావేశం అధికారుల ఆగ్రహానికి బలిఅయినది. ప్రజాప్రతినిధులను, సేవాదళ సభ్యులను. కార్యకర్తలను అధికారులు లాఠీలతో కొట్టిరి బ్రిటిష్ సైనికులు. బెంగాల్ రాష్ట్రం కిరీటం లేని చక్రవర్తి అని పేరు తెచ్చుకొన్న సురేంద్రనాథ్‌లను అవమానపరచి కోర్టులో శిక్షవేయించారు. డబ్బులు కట్టించుకున్నారు.

ఈపరిస్థితిని స్వయంగా చూసిన అరవిందులవారు బరోడాలో బహిరంగ సభలో ఉపన్యాసంలో నాటి విషమ పరిస్థితిని ఇలా పేర్కొన్నారు.

" ఆ పరిస్థితినుండి తల్లిని (భారతదేశాన్ని) కాపాడాలని 1906 జూలై నెలలో బరోడా కళాశాలలో 900రూ॥లు నెల జీతాన్ని ఉపాధ్యక్ష పదవిని వదిలి బెంగాలు రాష్ట్రంకు వచ్చిరి శ్రీ అరవిందులవారు.

బరోడానుండి బెంగాలీ రాష్ట్రం వస్తున సమయంలో అరవిందులవారు 'భవానీమందిరం' ఒక దానిని కొండల మధ్య రహస్య ప్రదేశంలో స్థాపించారని ఆవిషయం గూర్చి భవాని మందిరం అను పేరుతో కరపత్రం రచియించినట్లు దాన్ని ముద్రించినట్లు బారీంద్రుడు చెప్పినాడు. రాజకీయ దృష్టితో కాక ఆధ్యాత్మిక దృష్టి ఉన్న యువబృందంకు శ్రీ అరవిందుల వారు అక్కడ శిక్షణ ఇచ్చినారని ఓ వదంతి.

బెంగాలు రాష్ట్రంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలకు నూతన ఉద్యమం స్వాగతించటానికి నిరంకుశ పరిపాలన జరగటానికి, ప్రభుత్వ పాఠశాలలకు బదులుగా, జాతీయ విద్యా సంస్థలు నెలకొల్పాలని శ్రీ అరవిందులవారు నిర్ణయించినారు. అందుకు తగ్గ సన్నాహాలు మొదలు అయ్యాయి.

ఆనాటి ప్రభుత్వ పాఠశాలలోని లోపమును జాతీయ విద్యాసంస్థలు సరిచేసి, ఉన్నత ప్రమాణిక విద్యను విధ్యార్థులకు అందచెయ్యాలి అని పరభాష(ఆంగ్లభాష)లో కాక మాతృభాషలో విద్యాభోదన సాగాలని, అందరూ రాజకీయ పెద్దలు అంగీకరించిరి.

విద్యార్థులు రాజకీయ సభలకు వెళ్ళరాదని ప్రభుత్వం యువత మీద ఆంక్షలు విదించింది. రంగపు మండలం యొక్క అధికారి ఆమండలంలోని విద్యార్థుల రాజకీయ సభకు వెళ్ళినారని తెలిసి, వారందరికి 5రూ॥ చొప్పున జరిమానా విధించిరి. ఇవన్నీ జాతీయ విద్యాసంస్థ స్థాపనకు పురిగొలిపినవి. ఆఫలితంగా 7రోజులలోపు రంగపురులో జాతీయ విద్యాసంస్థ నెలకొల్పబడినది. సభకు హాజరైన విద్యార్థులను నానా విధముల శిక్షలకు గురిచేసి వారి భావిజీవితానికి భంగం కలుగునట్లు ప్రభుత్వ పాఠశాలలో వారికి ప్రవేశం రద్దు చేసింది బ్రిటిష్ ప్రభుత్వం. అలా వెడలగొట్టిన విద్యార్థులు గాలికి తిరుగరాదని, అలా అయితే దేశం పాడవుతుందని పెద్దలందరూ భావించి గుర్తించి దానికి పరిష్కారం చూపాలనే ఉద్దేశంతో ఈ జాతీయ విద్యాసంస్థను స్థాపించిరి.

సర్‌గురదాస్ బెనర్జి, రకవిహారి ఘోష్, భూపేంద్రనాథ్ బోస్, డాక్టరు నీలరత్నా సర్కార్ మొ॥ 30 మంది పరిపాలనా

సంఘ సభ్యులై, ఒక ప్రణాళిక రూపొందించి 1906 నవంబరు 17వ తేది జాతీయ కళాశాలను స్థాపించిరి. ఆకళాశాలకు ప్రధానాచార్యులుగా ఉండమని పై సంఘంవారు అరవిందుల వారిని ఆహ్వానించిరి.

భారతదేశానికి తన జీవితం త్యాగం చేసిన అరవిందుల వారు అందుకు అంగీకరించి నెలకు అతి తక్కువ జీతం (కేవలం 75రూ॥) తీసుకునేందుకు అంగీకరించి ఆపదవిని స్వీకరించిరి.

ఈ జాతీయ విద్యాసంస్థకు ఎంతో మంది శ్రీమంతులు పండితులు, ధనవంతులు, ధన, స్థల సహాయం చేసినారు. చేస్తున్న మంచి పనికి అందరూ చేయూత నిచ్చిరి. మొట్టమొదటి సుభోద్ చంద్ర మల్లిక్ లక్ష రూ॥ మరొక శ్రీమంతుడు 25వేల వార్షిక ఆదాయం వచ్చు స్థిర ఆస్తులను మరొకరు 2లక్షలు విలువ చేయు ఒక భవనం ఇచ్చిరి.ఇలా ఎందరో ఎన్నో తీసుకువచ్చి జాతీయ విద్యాసంస్థకు చేయూత నిచ్చారు. కాని శ్రీ అరవిందులవారి సేవ ఆ కళాశాలకు కొద్దిరోజులు మాత్రమే పరిమితమైనది.

అరవిందులవారి జాతీయ విద్యావిధానం ఎంతో ఉన్నతమైనది. జాతీయ విద్యాపద్ధతులు గూర్చి అరవిందుల వారు రచించిన వ్యాసములు చూస్తే వారి జాతీయ విద్యయందు

ఉన్న ఆదర్శాలు గౌరవం మనకు అర్ధమవుతాయి.

"జాతీయవాదులు ప్రభుత్వపాఠశాలకుప్రత్యామ్నముగా జాతీయ పాఠశాలలు ఉండాలని సంకల్పించగా, విద్యసంస్థలోని మితవాదులు ప్రభుత్వ అధికారులు యొక్క ఆగ్రహంకు బలికావలసివస్తుందని, లోపములను కొంతవరకు సరిచేసి ప్రభుత్వ పాఠశాలకు అవి సహాయంగా ఉండాలని నిశ్చయించిరి. జాతీయ విద్యలో కూడా ప్రభుత్వం కలుగచేసుకొనుటచే అందులో కూడా నాణ్యతమైన విద్య కరువు అవుతుందని తలచారు. అరవిందులవారు. బరోడా కళాశాలలో మాదిరిగానే చరిత్ర ఆంగ్ల భోదించినట్లే, ఇక్కడ కూడా వారు భోదించుట తప్ప, వారి ఉన్నత భావాలను తీర్చిదిద్దుటకు ఏమాత్రం అవకాశం రాలేదు. వీలుకాదు. అందువల్ల అరవిందుల వారు కాలేజీ తీర్చి దిద్దుటకు ఏమాత్రం అవకాశం రాలేదు, వీలుకాలేదు. అందువల్ల అరవిందులవారు కాలేజీ నుండి వెళ్ళిపోయాక జరిగినది అని చెప్పవచ్చును. శ్రీఅరవిందులవారు ఇలా చెయ్యటం ద్వారా కళాశాల విద్యార్ధులకు, సహ ఉపాధ్యాయులకు నచ్చలేదు. అప్పుడు వారందరూ అరవిందుల వారిని ఉపదేశం చెయ్యమని వేడుకొనిరి. అరవిందుల వారు వీడుకోలు సభలో మాట్లాడిన సందేశమిది.

"నేను ఉద్యోగం వదిలిన సంగతి మీకు తెలుసు. ఈ

సమయమున నాకు కష్టాలు వచ్చునని అందుకు మీ అందరు సహాయపడుదురని నిన్నటి సభలో మీరు చెప్పిఉన్నారు. రానున్న కష్టములను కష్టములుగా నేను తలవను. ఎందుకంటే నాబాల్యం నుండి నేను నిర్వహించిన కర్తవ్యంలో నేను ఎదుర్కొన్న కష్టాలతో పోలిస్తే రానున్న కాలంలో వచ్చు కష్టాలు ముందుగా నేను పసిగట్టకలనని, అందుకు నేను అన్నివిధాల సిద్ధంగా ఉన్నానని, నాకు ఏ విధమైన భాద లేదని మీకు ఈ సభాపరంగా తెలుపుతున్నాను.

ఏకార్యం నేను చేయతలపెట్టానో ఆకార్యం ఏ కష్టాలు అనుభవిస్తానో ఆకార్యం పట్ల, ఆ ఉద్యమం పట్ల మీ సహాయం నాకు ఉంటుందని నేను భావిస్తాను. నేను ఏమాత్రం బాధ పడకుండా కష్టాలను అనుభవిస్తాను. అవినాకు సూర్యోదయం లాంటివి. ప్రతిరోజు నిద్రలేవగానే నన్ను పలకరిస్తాయి.



ఏకార్యం కొరకు ఏ ఉద్యమంకొరకు ఈ కళాశాల స్థాపించబడినదో దానిని నిర్వహించండని మాత్రమే నేను మీకు ఇప్పుడు చెపుతున్నాను. ఇప్పటికి ఆ ఉధ్యమం ఏమిటో మీరు అర్ధచేసుకుంటారని నేను భావిస్తాను. మీకు విషయజ్ఞానం, జీవన ఉపాధికి అవకాశం కల్గించుటకు కాదు. మేము ఈ జాతీయ కళాశాల స్థాపించినది, దేశానికి స్వేచ్ఛ వాయువులు మీనుంచే రావాలని మా ఉద్దేశం, దేశసేవకన్నా ఉత్తమమైనది ఏది లేదు.

దానికోసం విద్యను నేర్చుకో, నీ ఆత్మను, ప్రాణాన్ని దేశం కొరకు ఉపయోగించు. దేశ సంతృప్తి కొరకే కష్టపడు. ఈ హితోపదేశం నందే సర్వం ఉన్నవి.

"వందేమాతరం" పత్రిక అప్పటికే దేశవ్యాప్తంగా ఉన్న పత్రికలో ఒకటి.

నూతన ఉద్యమ సిద్ధాంతాలను వెల్లడించటానికి జాతీయ పక్షమున దేశం అంతటా ప్రచారం చెయ్యటానికి ఆంగ్లమున ఒక దిన పత్రిక స్థాపించవలసిన అవసరం ఎంతో ఉంది. అంతకు కొన్ని రోజలు ముందు జాతీయవాది, ప్రతిభాశాలి, బ్రహ్మ చాందోస్వామి అయిన విపిన చంద్రుని సాయంతో 'వందేమాతరం' అను వార పత్రిక స్థాపించిరి. జాతీయ పక్షనాయకులగు తిలక్, శ్రీఅరవిందులు, అశ్వనీకుమారదత్తు, సుభదచంద్రమాల్లిక్ మొ॥వారు సుభోద్ చంద్రమాల్లిక్ ఇంట్లో సమావేశమై నూతనంగా నెలకొల్పిన వందేమాతరం పత్రికనే జాతీయ పక్షమున జాయింట్ స్టాక్ కంపెనీని స్థాపించి. దాన్ని దిన పత్రికగా నిర్వహించాలని, దానికి ప్రధాన సంపాదకునిగా శ్రీ అరవిందులవారు ఉండాలని ఆ సమావేశంలో తీర్మానించిరి.

శ్రీ అరవిందులవారు సంపాదకత్వం చేపట్టిన నాటినుంచి 'వందేమాతరం పత్రిక ఒక సంచలనాన్ని

సృష్టించింది. మనదేశమందే కాక విదేశాలలో సైతం వందేమాతర పత్రిక వ్యాప్తి చెందినది.

మొదటిసారిగా తన 'ఆనందమఠ' అనే నవలలో 'వందేమాతరం' అనే పదాన్ని గానం చేసినది ఋషి బంకించంద్ర చటర్జీ వారు. దాని అర్థం తెలిపినది శ్రీ అరవిందులవారు. భారతదేశం కేవలం నదీ పర్వతారణ్య మయమయిన జడపదార్థ కాదని, సర్వశక్తి అని భార్య మృణాళినిదేవికి రాసిన లేఖలో ఉంది.



స్వరాజ్య, సామ్రాజ్య సంబంధములను ఆధ్యాత్మిక దృష్టితో విమర్శించి 'సంపూర్ణ స్వాతంత్రమే' మన ఆదర్శమని నిర్భయంగా లోకంకు చెప్పినవారు శ్రీ అరవిందులవారే. అరవిందులవారు చెప్పిన ప్రతి ఆదర్శవిధానమును ఆధ్యాత్మిక జ్ఞానంతో ముడిపెట్టి, ధర్మశాస్త్ర సమ్మతమైన స్వదర్శ పరిపాలనా సూత్రములకు అణుగుణమె ప్రతిపక్షాలు ఖండింపరానంతగా చక్కగా ఉండెను. అందువల్లనే కాబోలు 'వందేమాతరం పత్రిక నిత్యపారాయణ గ్రంథంగా ఉండెను. ఆ పత్రికలోని సంపాదకీయం వ్యాసములు ఇండియాలో ఎన్నో పత్రికలందే కాక, లండన్‌లో ప్రసిద్ధిచెందిన టైమ్స్ పత్రిక కూడా ప్రచురించింది.

'వందేమాతరం' పత్రికకు రోజురోజుకూ ప్రజాధరణ

పెరిగిపోయింది. యువకులను ఉత్తేజపరిచే విధంగా విద్యయందు, పరిశ్రమలయందు, భావాలయందు, నిత్య వ్యవహారాలలో స్వదేశం యొక్క తత్వాన్ని తెలియపరిచారు అరవిందులవారు. ప్రభుత్వపాఠశాలలు తగ్గినవి, జాతీయ పాఠశాలలు పెరుగుట జరిగినది. ప్రభుత్వ న్యాయస్థానములు బహిష్కరింపబడి, పంచాయితీ పద్ధతులవల్ల ఆయా మండలంలోని పెద్దలు ధర్మపాలన ప్రారంభించిరి. ప్రభుత్వం వారి సాయం లేకనే, ప్రతిచోటా స్వచ్ఛంద సేవా సంస్థలు, బృందాలు ఏర్పడ్డాయి. వారే ప్రజలలో చైతన్యం తెచ్చి విశ్వాసములు కలుగుచేస్తున్నారు.



ఈలాంటి ఎన్నో నూతన కార్యాలకు శ్రీకారం చుట్టిన 'వందేమాతరం' పత్రిక ప్రభుత్వ ఆగ్రహానికి లోనుకాక తప్పలేదు. యుగాంతర్ "సంధ్య" తమ దేశ భాషా పత్రికలనుండి వ్యాసాలు అనువదించి వందేమాతరంలో ముంద్రించిరని ప్రభుత్వం వారు దోషారోపణ చేసింది. వందేమాతర పత్రికమీద. అపుడు కోర్టు దిక్కార దోషంగా విపిన చంద్రునకు 6నెలలు జైలు శిక్ష పడింది. అరవిందులపై మోపిన నేరం రుజువుకాలేదు కాబట్టి ప్రభుత్వం కోర్టు అరవిందులవారిని ఏమి చెయ్యలేకపోయింది.

ఈ విధంగా పలు విమర్శలు ఎదుర్కొన్నది

వందేమాతరం పత్రిక. అటుపై శ్రీ అరవిందులవారు వందేమాతరం పత్రికలో తమ పాలు పంచుకోవడం తగ్గినది.

అరవిందులవారు లేలేగారిని కలుసుకొని యోగ తత్త్వ విషయముల గూర్చి అడిగి తెలుసుకున్నారు. లేలేగారు యోగభ్యాసము గురించి శ్రీ అరవిందులకు ఎన్నో కొత్త విషయములు తెలిపారు. లేలేగారు శ్రీ అరవిందులవారికి ఈ విధంగా తెలిపారు " ధ్యానములో కూర్చుండు ఏ ఆలోచన చెయ్యకు. నీ మనస్సునందే నీ దృష్టి నిలుపు. అపుడు నీ మనస్సుకి ఏ ఆలోచనలు వస్తాయో నువ్వు గుర్తిస్తావు. ఆ ఆలోచనలు సూన్యం అయ్యేవరకు నువ్వు ఏకాగ్రతతో నిశ్చల స్థితిలో, నీ మనసువైపు నీ దృష్టిని నిలుపు" అని అరవిందులవారికి తెలిపెను.



తనకు తెలియని విషయాలు తెలిపిన లేలేగారి పట్ల అరవిందులవారికి మంచి అభిప్రాయము ఏర్పడినది. లేలేగారు చెప్పిన దానిలో నిజనిజాలు చూడక వాటిని అమలుచేశానని దాని ఫలితం ఎంతో అద్భుతమని తెలిపారు శ్రీ అరవిందుల వారు. శ్రీ అరవిందులవారికి కేవలం 3 రోజులలో మౌన సాక్షాత్కారం లభించినది. మౌన సాక్షాత్కారనికి మామూలు మనిషికి యోగాలో ఉన్నపుడు కొన్ని నెలలు, సంవత్సరాలు కూడా పట్టవచ్చు. కాని శ్రీ అరవిందులవారికి ఉన్న ఏకాగ్రత

మనకు అర్ధం అవుతుంది. దృశ్యసామ్రాజ్యము, భావ సామ్రాజ్యము తనకి నచ్చిన ఆలోచనలును స్వీకరించాలన్నా, నిరాకరించాలన్నా అంతా క్షణకాలంలో జరుగుతున్నది. ఆలోచనను అదుపు చేయగల శక్తి, సామర్ధ్యం ఒక యోగాలోనే ఉన్నదని శ్రీ అరవిందులవారు తన అనుభవాన్ని తెలియచేశారు.

లేలేగారు విద్యలోకాని, ఆధ్యాత్మిక పురోగతి కాని పరిపూర్ణంగా సంపాదించని వారయినప్పటికి శ్రీ అరవిందులవారు అవి ఏమాత్రం పట్టించుకోక కేవలం లేలేగారు చెప్పిన మాటలు చేతలతో చేసి చూపించారు. ఇంకా లేలేగారి గూర్చి ఇలా అన్నారు. లేలేగారు యోగాలో మహామూర్తి, లేలేగారిలో ఒక మహత్తర శక్తి నాకు కనిపించిందని, దాన్ని తను తెలుసుకున్నానని, దానివల్ల ఆత్మార్పణ కల్గిందని, దీనికి కారణం లేలేగారని అరవిందులవారు లేలేగూర్చి తెలిపిన విషయం.

**లేలేవారు శ్రీ అరవిందుల వారి గూర్చి ఇలా అన్నారు :**

"శ్రీ అరవిందుల వారి శక్తి సామర్ధ్యాలను చూసి, అలాంటి ఉన్నత భావాలు, ఆదర్శాలు ఉన్న వ్యక్తిని నేను ఇంతవరకు చూడలేదని, ఇకపై చూస్తానని కూడా నమ్మకం లేదని, శ్రీఅరవిందులవారి ఏకాగ్రత వల్ల వారు యోగాలో

అత్యంత ఉన్నత స్థాయికి వెళతారని, ఎన్నో అద్భుతాలు కూడా సృష్టిస్తారని లేలేగారు తన అభిమానాన్ని ఈ విధంగా వ్యక్త పరిచారు.

1908 మార్చి నెలలో విష్ణు భాస్కర లేలే వారీంద్రుని ఆహ్వానం మేరకు కలకత్తాకు వచ్చిరి. అపుడు శ్రీ అరవిందులవారిని సాధన ఎలా సాగుతున్నది? ఏవిధంగా సాధన చేయుచున్నారని ప్రశ్నించిరి లేలేగారు.

అందుకు సమాధానంగా శ్రీ అరవిందులవారు ఇలా అన్నారు. "నేను ఏసాధన చేయుటలేదు. భగవంతుడే సర్వం నాతో చేయిస్తున్నాడు. భగవంతుని ఆదేశానుసారమే నా జీవితం నడుస్తున్నది అని లేలేవారికి సమాధానం తెలిపెను.



ఆరవిందులవారు తమ భార్యకు రాసిన లేఖనుండి కొన్ని అంశాలు

జనవరి 8న నేను వస్తాను అని చెప్పాను. కాని రాలేదు. అది నా ఇష్టానుసారం జరుగలేదు. ఎక్కడికి భగవంతుడు నన్ను తీసుకొనిపోవుతున్నాడో నేను అక్కడికి వెళ్తున్నాను. ఈ సారి నేను నా పనిమీద పోలేదు. భగవంతుని పనిమీద వెళ్ళాను. ప్రస్తుతం నా మనస్సు యొక్క అవస్థ కొత్తరూపం దాల్చినది. ఆవిషయం ప్రస్తుతం ఉత్తరంలో చెప్పను. ఇక నుంచి నిస్వార్థంగా భగవంతుడు నన్ను ఎక్కడికి తీసుకపోతే అక్కడికి

కీలుబొమ్మలాగా వెళతాను. ఏది చేయిస్తాడో అదే చేస్తాను.

నా సర్వకార్యములు నా ఇష్టంతో కాక భగవంతునిపై ఆధారపడినవి. నువ్వు నా దగ్గరికి వచ్చినపుడు ఆవిషయం తెలుసుకుంటావు. ఈ ఉత్తరం ఎవ్వరికి చూపకు. ఈ విషయం నీకు తప్ప ఎవరికి చెప్పలేదు. అది చెప్పుట కూడా తప్పే అని నా భావన.



నర్మదానది తీరం (శ్రీ కాళీమాతమందిరం ఇక్కడనే ఉన్నది)



కలకత్తాలో శ్రీ అరవిందులవారు నివసించిన గృహం




'బందే మాతరం' పత్రిక ముఖచిత్రం

వందే మాతరం పత్రిక కార్యాలయం, కలకత్తా





ధర్మ, కర్మయోగి పత్రిక కార్యాలయం, కలకత్తా



కలకత్తాలో శ్రీ అరవిందులవారు (1907, ఆగష్టు)





నర్మదా నదీతీరంలో శ్రీ అరవిందులవారు దర్శించిన
శ్రీ కాళీమాత మందిరం



1909వ సం॥ కలకత్తాలో శ్రీ అరవిందులవారు





శ్రీ విష్ణు భాస్కర్ లేలే

1906వ సంవత్సరము కలకత్తాలో జరిగిన దేశీయ మహాసభలో పితామహ దాదాభాయి అధ్యక్షత వహించి తీర్మానించిన 'స్వరాజ్య బహిష్కార' తీర్మానములకు మితవాదు లడ్డుపడి స్వరాజ్య అను పదం తీసివేసి, బ్రిటిష్‌ప్రభుత్వ అధికారులకు లోబడి ఎన్నో కుట్రలు పన్నసాగిరి. బహిష్కార తీర్మానమునే రద్దు చేసిరి.

1907వ సం॥ డిసెంబర్ నెలలో సూరత్ పట్టణంలో దేశమహాసభ జరిగింది. ఆ సభ విశేషాలు తదుపరి విషయాలు కింద వివరించబడినవి.

ఈ సమావేశంలో ముఖ్యంగా మితవాదులు మరియు జాతీయవాదుల మధ్య ఉన్న విభేదాలు బహిరంగంగా బయటపడ్డాయి. జాతీయవాదులయిన తిలక్, అరవిందులవారి మధ్య, మితవాదులైన మెహతా, గోఖలేల మధ్య విభేదాలు ఈ సభలో అందరికి తెలిసేలా స్పష్టమైనది.

అఖిల భారతదేశమునకు ప్రజాప్రతినిధి సంస్థయై దేశప్రజల మనోభావాలను గ్రహించి అందుకు అనుగుణంగా తీర్మానం చేసి, దేశాభివృద్ధికి తోడ్పడవలసిన దేశీయ మహాసభ నేటివరకు కొందరి నాయకులు (గోఖలే, మెహతా, వాచా, కృష్ణస్వామి అయ్యర్) నిరంకుశ పాలనమునకు లోనై కేవలం మితవాదుల కేంద్రమై ఉండెను.

వీరి యొక్క నిరంకుశ చర్యలను అరికట్టడానికి, అంతం చెయ్యడానికి జాతీయవాదులు నిశ్చయించుకొనిరి.

వారి యొక్క చర్యలు జాతీయవాదుల మనసును కలిచివేసింది.

స్వరాజ్య బహిష్కార స్వదేశ జాతీయ విద్యలను గూర్చి మహాసభలో తీర్మానం చెయ్యాలని, అందరిచే ఆమోదించాలని, ఎవరికైనా సందేహాలు ఉంటే, ఆ విషయాలు చర్చించాలని జాతీయవాదులు పట్టుపట్టారు. ఇవేగాక ఇతర విషయాలలో కూడా మితవాదుల నుంచి తీవ్రభేదాలు వచ్చాయి. మొట్టమొదట నాగపూర్‌లో సభ ఏర్పాటుకై సిద్ధంకాగా, అక్కడ జాతీయవాదులకు పలుకుబడి ఎక్కువ ఉన్న కారణంగా సూరత్‌కు సభ మార్చిరి. జాతీయ వాదులందరి ప్రకారం పంజాబు కేసరి అను పేరు ఉన్న లాలాలజపతిరాయ్ సభాధ్యక్షులుగా ఉండాలని నిర్ణయించగా, మితవాదులు మాత్రం రసవిహారిఘోషును సభాధ్యక్షునిగా నిర్ణయించిరి.



అందరు తమ తమ వాదనలు గెలవాలని సిద్ధపడి సురత్ పట్టణమున సమావేశమైరి.

తుదకు జాతీయవాదులు రసవిహారిఘోషును అధ్యక్షునిగా ఉండి సభ నడిపించాలని ఒప్పుకొని, తమ వాదన వినడానికి కూడా అవకాశం కల్పించాలని మితవాదులకు రాసిరి. మితవాదులు కాని, మధ్యలో ఉన్న రాయబారులు నుంచి సమాధానం రాలేదు.

సభ ప్రారంభం కాగానే అధ్యక్షుడి ఎన్నిక తర్వాత

లోకమాన్యుడు మాట్లాడటానికి సభపైకి వెళ్ళగా మితవాదులు అతనిని అడ్డుకొనిరి. దాంతో ఇరు వర్గాల మధ్య పెద్ద గొడవ జరిగినది. విధ్వంస ఘటనతో సభ ముగిసినది. ఒక అరవిందులవారు మాత్రం మౌనం వహించి, శాంతంగా ఉన్నారు. కన్నులారా ఆయన్ను చూసిన ఎందరో ఈ సత్యాన్ని బహిరంగంగా చెప్పి ఉన్నారు.

ఆ సభకు ఎంతోమంది ప్రతినిధులు వచ్చినారు. జాతీయవాదులు దాదాపుగా అన్ని రాష్ట్రాలనుంచి 800 మంది దాకా వచ్చినారు.

సభా విధ్వంసమైన మరునాడు మితవాదులు సభా ప్రవేశమునకు కొన్ని నియమాలు పెట్టి, వాటికి ఒప్పుకున్నవారే సభ ప్రవేశానికి అర్హులని తేల్చినారు. సభా సమావేశపరచి, జాతీయవాదులను నిందించుచు తమకు అనుకూలమైన తీర్మానములను చేసి తృప్తి పొందినారు. మితవాదులు చర్చకు అనుగుణంగా జాతీయవాదులు మాత్రమే ఒక సభ ఏర్పాటు చేసి, ఆ సభకు అరవిందుల వారిని అధ్యక్షునిగా ఎన్నుకొని, విధ్వంస ఘటనకు కారణాలు, భవిష్యత్తు ప్రణాళిక ఏర్పాటుకు ఎలా చేయ్యాలని నిర్ణయించిరి. సభను ముగించారు.

మితవాదులు 'బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత స్వపరిపాలనము' అని తీర్మానించిన విషయంపై శ్రీ అరవిందులవారు తమ యొక్క సత్తా చాటుటకై మరియు వారి వాదనలు, తీర్మానం ఖండించుచు,

'స్వాధీనత యొక్క అర్థము' గూర్చి ఒక వ్యాసం రాసినారు. ఆ వ్యాసం క్రింద తెలియచేస్తున్నాము.

స్వాధీనత మన రాజకీయ ఉద్యమం యొక్క ఉద్దేశ్యము. కానీ స్వాధీనత అంటే ఏమి? ఈ విషయంలో ఎన్నో అభిప్రాయభేదములు ఉన్నాయి. సంపూర్ణ స్వరాజ్యమే స్వాధీనత అని, మరి కొందరు స్వాయత్త శాసనములు, కొందరు శాసనమును ఏర్పర్చుట అని ఎవరి ఉద్దేశము వారివి.

రాజకీయ స్వాతంత్ర్యము స్వరాజ్యం యొక్క ఒక భాగం. ఆ భాగానికి బాహ్య, అంతర స్వాతంత్రాలు ఉన్నాయి. విదేశీయులనుండి ముక్తి పొందుట బాహ్య స్వాతంత్ర్యము. ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడుట అంతర స్వాతంత్రం.

పరాధీనత ఏ జాతికైనను మృత్యువు యొక్క దూత, స్వాధీనత అంటే జీవితమునకు రక్షణ. విదేశీయులు మన దేశంపై అధికారంను చెలాయిస్తూ ఎంత దయతో వున్న మన హక్కును వారు వారి గుప్పిట్లో ఉంచుకున్నట్లే. పరులు వేసిన బాటపై మనం నడవటం మనకు ఏంత మాత్రం మంచిది కాదు. మనం మన దారిని వారిని అనుసరించి తయారుచేసుకున్న తప్పు లేదు కాని వారి బాటలో మనం నడువకూడదు.

వారి భాష ఉపయోగించి మన భాషను మనం కించపరుస్తున్నాం. స్వదేశంలో ఉంటూ పరదేశీయుల అధికారంతో

మగ్గటం సరి అయినది కాదు. మన ఆశ, మన ఉనికికి జాడ ఉండదు. మన అనేది ఏది మన దగ్గర ఉండదు. మనవల్ల వారికి కల్గిన ఆపద ఏమి? వారివల్ల మనకు జరిగిన, జరుగుతున్న నష్టం ఎంత? విచక్షణరహితులుగా ఇంకా ఎన్ని రోజులు, నెలలు, సంవత్సరములు గడుపుదాం.

శ్రీ అరవిందుల తమ్ముడు వారీంద్రులవారు, తమ స్వీయచరిత్రలద్వారా మనకు తెలిసే విషయాలు ఏమిటంటే, అతడు రాజసగుణ ప్రధానుడని, అనుకొన్నది అనుకున్నట్లు చేయ్యగలడని ముందు, వెనక ఆలోచించక తన మనసు ప్రకారం నడుచుకొంటాడని తెలుస్తుంది. దేశస్వాతంత్ర్యమునకు ఆధ్యాత్మికశక్తి తోడుగా ఉంటే దాని వల్ల కలిగే మంచి ఎంత ఉంటుందని వారీంద్రులవారు గుజరాత్‌లో ఒక సంసారి యోగిని కలిసినట్లు, వారీంద్రుని ఆత్మకథలో తెలుస్తుంది.

సూరత్ మహాసభకు వచ్చిన వారీంద్రుడు 'విష్ణు భాస్కర లేలే' అను యోగిని గూర్చి శ్రీ అరవిందులవారికి తెలిపినారు. సూరత్ మహాసభల అనంతరం శ్రీ అరవిందులవారు లేలే వారిని కలుసుకొనిరి. యోగతత్త్వ విషయాలు అడిగి తెలుసుకొనిరి. ప్రశాంతత కొరకు యోగసాధన చెయ్యాలని ధ్యానమున కాలం గడపమని సలహా ఇచ్చి అందు మార్గాలను తెలిపినారు లేలేగారు.





1909 అక్టోబర్‌లో సూరత్‌కాంగ్రెస్‌లో శ్రీ అరవిందులవారు



శ్రీ గోఖలే మహాశయుడు

శాసన బద్ధమైన అందోళనమునకు అంతరాయం వచ్చి రాజమార్గమున నోరెత్తి హృదయవేదనను వెల్లడించుటకు, మరియు ఏకార్యం చేయుటకు వీలులేని కఠిన పరిస్థితి వచ్చినది. దాన్ని సహింపలేక యువకులతో సహనం నశించి విప్లవ పద్దతులను పాటించి పశుబలంతోనే ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలని నిశ్చయించిరి.రష్యా చక్రవర్తి జార్ నిరంకుశ చర్యలకు ధీటుగా రష్యా ప్రజలు అవలంభించిన విప్లవ, ప్రతీకారపు వ్యూహాలు యువతకు ఆదర్శమైనాయి.

అందుకు తగ్గట్టు విప్లవ సంఘమును అతి రహస్యంగా నెలకొల్పి వారికి తగిన శిక్షణ ఇచ్చెను. శిక్షణ కోసం విదేశాలకు కొందరిని పంపి బాంబులు తయారు చేయుటలోని రహస్యం తెలుసుకొనిరి.



ప్రభుత్వ ఉద్యోగులను దొరలను రహస్యముగా హతమార్చాలని, ప్రమాణ పత్రాలపై నెత్తురుతో వ్రాసుకొని దీక్షకు పూనుకున్నారు. ఉన్నత ఉద్యోగులు ప్రయాణం చేయు రైలు బండ్లను బాంబులతో పేల్చాలని, మరికొంతమందిని చేత జిక్కించుకుని చంపాలని యువకులు తమ విప్లవసంఘంలో నిర్ణయించినారు.

ఏపాపం తెలియని 'కెన్నడీ' దంపతులను తమను శిక్షించిన "కింగ్సుఫోర్టు" దంపతులుగా భావించి. భ్రమించి కెన్నడీ

దంపతులను చంపిరి. ఆదారుణ హత్య పాపమే ఆలీపూరు కుట్రకేసుగా పోలీసులు తమ రికార్డులో నమోదు చేసుకొనిరి.

ఈ విప్లవకాండ నాయకుడిగా ఉన్న వారీంద్రుడు శ్రీఅరవిందులవారికి తమ్ముడని కాని లేక జాతీయ వాదాన్ని ప్రజలకు చెప్పి స్వాతంత్ర్యం కొరకు యువతను రెచ్చ కొడుతున్న కారణంకాని మరే ఇతరకారణముకాని కెన్నడీ దంపతుల హత్యవెనుక శ్రీ అరవిందులవారే సూత్రధారిగా ఉన్నారని పోలీసువారు భావించారు.

1908వ సం॥ మే నెల 2వతేది ఉదయం 5 గంటలకు పోలీస్ కమీషనర్ మరియు ఇతర సిబ్బంది కలిసి అరవిందులవారు ఉంటున్న ఇంటిని ముట్టడించిరి. పోలీస్ వారు అరవిందులవారిని బంధించి, ప్రతిగది, ప్రతిచోట సోదాచేసి ముఖ్యమైన పత్రాలను తమ స్వాదీనం చేసుకున్నారు. అందులో అరవిందులవారు తమ భార్య మృణాళినికి రాసిన లేఖలు కూడా ఉన్నాయి. పోలీస్‌వారు ఆ లేఖలు కోర్టుకు అప్పగించిరి. అరవిందులవారిని 3 రోజలు పోలీస్ స్టేషన్‌లో ఉంచి 5వతేదీన ఆలీపూర్ జైలులో పెట్టారు. 7వ తేది మెజిస్ట్రేట్ కోర్టులో విచారణ ప్రారంభించిరి.

అకస్మాత్తుగా హత్యారోపణ క్రింద జైలుకు వచ్చుట, నరకమైన జైలులో గడుపుట, ఏకాంతంగా అనుభవించిన కృష్ణుని

దర్శనం మిగితా విషయాలను తెలిసి శ్రీ అరవిందులవారు జైలునుంచి బయటకు వచ్చి 'కారాకహాని' అను ఒక పుస్తకాన్ని రాసిరి. అందులో చెప్పిన ప్రతిమాట ప్రతి సందర్భం నిజమే. శ్రీ అరవిందులు స్వయంగా చెప్పిన జైలు జీవిత విశేషాలు కింద తెలుపుచున్నాము.

'మే నెల 1వతేది శుక్రవారం రాత్రి గడిచింది. ప్రొద్దున 5 గంటలకు నా సోదరి హృదయవేదన నాగదివద్దకు వచ్చి పేరు పెట్టి నన్ను పిలిచింది. నేను నిద్రలేచితిని, మరుక్షణం నా చిన్న గది పోలీసులతో నిండిపోయినది. ఎర్రతలపాగా కట్టుకున్న పోలీసులు, పరిశోధకులు, గూఢచారులు కూడా కాసేపటి తర్వాత వచ్చారు. ఒకపోలీస్‌వాడు నావైపు పిస్తోలు పెట్టి నన్ను కదలికలు గమనిస్తున్నాడు.అప్పటికి నేను నిద్రమత్తులోనే ఉన్నాను. క్రేగన్‌దొర నన్ను ఇట్లు అడిగెను 'అరవిందఘోష్ ఎవరు' నేనే అని నేను సమాధానం తెలిపితిని. వెంటనే నన్ను పట్టుకొని రమ్మని ఒక పోలీస్ వాడికి ఆజ్ఞవేశాడు క్రేగన్ దొర. వెంటనే నేను క్రేగన్ దొరతో వారించాను. సెర్చ్‌వారెంట్ చూపించమని అడిగాను. ఆసెర్చ్‌వారెంట్‌ను క్రేగన్ దొర నాకు చూపించాడు.నేను దాన్ని తీసుకొని చదివాను. వారెంటులో చూపిన బాంబు విషయములు చూసి పోలీస్‌వారు నన్ను కుట్రదారునిగా అనుమానిస్తున్నారని నేను గ్రహించాను.

నా ఇంట్లో ఏవిధమైన బాంబులుగాని, అందుకు సంబందించిన పదార్థములుగాని శోదించకముందే నన్ను బంధించటం నాకు అర్థం కాలేదు. క్రేగన్ దొర ఆజ్ఞ ప్రకారం పోలీస్ వాడు నా చేతులను సంకెళ్ళతో బందించాడు. నా నడుముకు ఒక త్రాడు చుట్టిరి. భారతీయ పోలీస్ నా వెనుక నిలుచున్నాడు.

పోలీస్ ఉన్నత ఉద్యోగులలో ఒకరైన వినోద కుమార గుప్త నా గూర్చి క్రెగన్ దొరకు ఏమో చెప్పెను. ఆ తర్వాత క్రేగన్‌దొర నన్ను ఇట్లు అడిగెను.

నువ్వు బి.ఏ. పాసు అయ్యావా! ఇటువంటి అద్దె ఇంటిలో ఏ సౌకర్యములేక, కనీసం పడుకోవటానికి పడక గూడా లేక ఉన్నావా?

ఎంతో మంచి విద్యా అర్హతలు ఉన్న నువ్వు ఇలా నివాసముంటడానికి సిగ్గుగా లేదా? అని ప్రశ్నించెను. అందుకు బదులుగా నేను ఇలా సమాధానం ఇచ్చితిని.

నేను బీదవాడిని బీదవాడిగానే బ్రతుకుతున్నాను. వెంటనే క్రేగన్ దొర కోపంతో అయితే ధనవంతుడివి కావాలని ఈ హత్యలు చేయుచున్నావా? అని నాపై మండిపడ్డాడు. అప్పుడు నాలో నేను ఇలా అనుకున్నాను. 'దేశంపై ప్రేమ, స్వార్థత్యాగం, దేశప్రజల గొప్పదనం, సంప్రదాయం తెలియని ఇంగ్లీష్ వారితో వాటి గొప్పతనం చెప్పుట అసాధ్యమని నేను

ఏమి మాట్లాడలేదు.

నా ఇల్లు పరిశోధించిరి. ఎన్నో కాగితములు పరిశీలించిరి. కొన్నింటిని వారు స్వాధీన పరచుకొనిరి. ఆకాగితములు ఏవో నాకు తెలుసును. అయినా వాటిపై నాకు ఎలాంటి ఆపేక్షలేదు. నావద్ద బాంబులకు సంబందించి ఏరకమైన కాగితములు ఉండవు. ఆవిషయం నాకు తెలుసు.

1908వ సం॥ మే నెల 1వ తేది శుక్రవారం 'వందేమాతరం' కార్యాలయంలో కూర్చొని ఉన్నాను. శ్రీశ్యామసుందర చక్రవర్తి అపుడు ముజఫర్‌పూర్ నుండి వచ్చిన ఒక టెలిగ్రామ్ నాకు ఇచ్చెను. దానిని చదువగా ముజఫర్‌పూర్‌లో బాంబు పేలిందని ఇద్దరు యూరోపియన్లు మరణించిరని తెలిసినది. నాటి ఎంపైర్ పత్రికలో పోలీస్ కమీషనర్ తనకు హత్యవిషయంలో ఎవరెవరికి సంబంధముందో తెలుసునని వారిని తర్వాత పట్టుకుంటానని ప్రకటించెను. వారు అనుమానించిన వారిలో ముఖ్యమైన పేరు నాది అని పోలీస్‌వారి దృష్టిలో నేను ప్రధాన హత్యాకారకుడని రాష్ట్ర విప్లవకారకులకు అధ్యక్షుడను నేనని నాకు తెలియదు. ఆరోజుతో నా జీవితం ఒక ఘట్టం ముగిసి, మరో నూతన ఘట్టం ప్రారంభమవుతుందని నాకు తెలియదు.

చాలా రోజులుగా హృదయస్థుడైన నారాయణుని

దర్శించు నిమిత్తం తీవ్ర ప్రయత్నం చేసితిని. కాని వేలకొలది ఆలోచనల వల్ల అది సాద్యపడలేదు. చివరికి ఆనారాయణ దయామయుడు, సర్వమంగళమూర్తి అగు శ్రీహరి సకల శత్రువులను ఒక్క దెబ్బతో సంహరించి నాకోరికను మన్నించెను. యోగా ఆశ్రమమును చూపించెను. ఆశ్రమమంలో ఇంగ్లీష్ వారిజైలు. నా జీవితంలో మంచిచేయు మిత్రులు ఉపకారం కన్నా చెడుచేయు శత్రువులవలె నాకు ఉపకారం కలుగుతుందని నేను గ్రహించాను. బ్రిటీష్ అధికారుల నిర్ణయం మేర జైలుకు వచ్చిన జైలులో శ్రీకృష్ణుని దర్శనభాగ్యం కలిగింది. నాకు బ్రిటిష్ వారిపై ఎలాంటి కోపంలేదు. ఎందుకంటే వారివల్లనే నేను భగవంతున్ని చూశాను.

విచారణ అవుతున్న సమయంలో నా తప్పుఉన్నదని అందుకు నేను ఒప్పుకోవాలని చాలామంది నన్ను బలవంతపెట్టారు. పోలీన్‌శాఖలో ఉన్నతాధికారులు, గూఢాచారులు ఎందరో నన్ను ఈ విషయంలో ఇబ్బంది పెట్టారు. గూఢాచార నిపుణుడైన మౌల్వీశా అసులే నాకు ధర్మ సంబందమైన మహా ఉపన్యాసం వినిపించారు. హిందువుల ఓంకార త్రివర్ణములు ఆ, ఉ, మా కు భాను యొక్క మొదటి మూడు అక్షరాలు ఆ లయ ఒక్కటే అని నాకు మౌల్వీశా చెప్పెను. అంతేకాక నాలాంటి వారు భారతదేశంకు పట్టిన శని

అన్నట్లు వారి అభివర్ణించారు. ఈ విషయంలో భారతీయులు సిగ్గుపడాల్సినది అని ఇప్పుడు సత్యం చెప్పినచో శిక్షలో ముప్పు తప్పును అని సలహా ఇచ్చెను.విపన చంద్రపాలు, అరవిందులు చేసిన ఏపనినైనా ముక్తకంఠంతో ఒప్పుకుంటారని మౌల్వీసా గారి ధృడవిశ్వాసం.

ధర్మభావం నంధు ఉన్నంతగా ఉన్నా మౌల్వీషా తన గూఢాచారి తనం వదిలిపెట్టలేదు. మా తమ్ముడికి బాంబులు తయారు చేయుటలో శిక్షణ ఇచ్చితిని అని మీరు ఏవిధంగా ధృడపరుస్తారు. మీకు ఎక్కడినుంచి ఈ సమాచారం వచ్చింది అని మాట్లాడుతుంటే మౌల్వీశా ఉలిక్కిపడి ఇట్లు సమర్ధించుకున్నాడు. లేదు, లేదు నీవల్ల ఈ తప్పు జరిగినదా అని అడిగితిని అంతే అని అక్కడినుండి వెళ్ళిపోయెను. శైలేంద్రుని నన్ను లాల్‌బజారు పోలీస్‌స్టేషన్‌లో రెండవ అంతస్తులో ఒక గదిలో ఉంచిరి. మా ఆహారం చాలా మితంగా ఉండేది. కొద్దిసేపటి తర్వాత ఇద్దరు ఇంగ్లీష్‌వారు మాగదికి వచ్చిరి. అందులో ఒకరు పోలీస్ కమీషనర్ హ్యాలిడే దొర అని నాకు తర్వాత తెలిసింది. మేము ఇద్దరం కలిసి ఉండుట చూసి హాలిడే దొర అక్కడి ఆధికారిపై కోప్పడిరి. నన్ను చూపించి ఇతనితో జాగ్రత్త ఎవరూను ఇతనితో కలిసియుండుటగాని, మాట్లాడుటకాని చెయ్యకూడదు అని అధికారితో చెప్పిరి. వెంటనే

శైలేంద్రుని మరోగదికి తీసుకుని వెళ్ళిరి. అందరూ వెళ్ళిపోయిన తర్వాత హ్యాలిడే నన్ను ఇట్లు అడిగెను. ఈ పని (బాంబు కుట్ర హత్య) చేయుటకు సిగ్గులేదా? నేను ఇందులో ప్రధానకుడినని మీరు ఊహించుటకు మీకేమి అధికారం ఉన్నది అని నేను హ్యాలిడేతో అన్నాను. అందుకు హ్యాలిడే నేను అలా ఊహించటం లేదు. నాకంతయు తెలుసు. అనగా నేను ఏమి తెలుసో ఏమి తెలియదో అది మీకు మాత్రమే తెలుసు. ఈ హత్యకాండతో నాకు ఎట్టి సంబంధం లేదు అని నేను తెలుపగా హ్యాలిడే ఏమి మాట్లాడలేదు.

నన్ను బందించుటకు 45 రోజులు ముందు ఒక అపరిచితుడైన పెద్దమనిషి నావద్దకు వచ్చి ఇట్లానాతో అన్నాడు. మహాశయ! నేను మీకు తెలియదు కాని తమరు నాకు తెలుసు. మీయందు నాకు ఉన్న భక్తిభావాములకు తమరిని జాగ్రత్తగా ఉండమని తెలుపుటకు వచ్చాను.

నన్ను కాన్నగర్‌లో ఎవరితో ఏమేమి మాట్లాడినది, ఎందుకు వెళ్ళినది అడిగెను. ఏదో పత్రికా సంబంధవిషయంలో అక్కడికి వెళ్ళాను. కొందరితో మాట్లాడి తిరిగి వచ్చాను అని ఆ పెద్దమనిషితో అన్నాను.దానికి ఆ పెద్దమనిషి ఇంక ఏమి చెప్పవద్దు. ఇక మీదట కాన్నగర్ వాసుల నెవరిని చూడొద్దు, కలవద్దు, మాట్లాడవద్దు. త్వరలో వారు మిమ్మల్నీ ఏదో

ప్రమాదంలో పడవేస్తారు. మీపై వారు పన్నాగం పన్నుతున్నారు. నన్ను దయచేసి ఏమి అడగవద్దు అని ఆ పెద్దమనిషి అనెను. ఈ సంభాషనలవల్ల నాకు ఏమి ఉపకారం కలుగుతుందో నాకు తెలియదు కాని నాకు సాయం చెయ్యటానికి వచ్చినందుకు ధన్యవాదములు అని ఆ పెద్దమనిషినుండి సెలవు తీసుకున్నాను. భగవంతుడిపై నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది. ఆయననే ఎల్లపుడూ నన్ను రక్షించును. ఈ విషయంలో జాగ్రత్త పడుట నిష్ప్రయోజనము అని నేను తలచితిని.

ఏమి భయపడవద్దు నా నిర్ధోషత్వం సంపూర్ణంగా ఋజువగుతుందని మా ఇంటిలో చెప్పవలసినదిగా ఆనాడు కోర్టుకు వచ్చిన బంధువులతో నేను అన్నాను. ఇలాగే జరుగుతుందని నా మనస్సునందు ధృడ విశ్వాసం ఉంది. మొదట నేను ఎంతో వ్యధచెందితిని కాని ప్రార్ధనతో శాంతి చేకూరినదినాకు.

నా జైలుగది 9 అడుగుల పొడవు, 5 అడుగుల వెడల్పు. దానికి కిటికీ లేదు. ముందుభాగం పెద్ద పెద్ద ఇనుప కమ్మెలతో కలసి తలుపుగా ఉంటుంది. చుట్టూ పెద్ద ఇటుక రాతి గోడ దానికి ఒక కొయ్యతలుపు, పైభాగములో ఒక మనిషి నిలబడి ఖైదీలు ఏమి చేస్తున్నారో ఆ కొయ్యతలుపుకున్న చిన్న రంధ్రంనుంచి చూసే వాళ్ళు. ఈ విధమైన గదులు ఆరు

వరుసలుగా ఉన్నాయి. ఆగదులను డిక్రేలంటారు. డిక్రేలంటే శిక్షుతులైనవారిగది. ఇందులో కూడా ఎక్కువతక్కువలు ఉన్నాయి. అధిక శిక్షకుగురిఅయిన వారిగది ముందు ఖాళీస్థలం ఉన్న ప్రహరీగోడ తలుపు మూసివేసి ఉంటుంది. ఇది నా జైలు ప్రపంచం.

తినటానికి ఒక పళ్ళెం, త్రాగుటకు ఒక గిన్నె రెండు పింగాణితో చేసినవి. అవికాక రెండు కంబళ్ళు. ఇవే మా సర్వస్వం. పళ్ళెం, గిన్నెలతో గదిని అలంకరించుకోవచ్చు ఎందుకంటే మా వద్ద అవి తప్ప మరేమి లేవుకాబట్టి. నేల నున్నగా లేక పల్లముగా ఉన్నంధున భోజనం చేస్తున్నపుడు ఒక చేతితో భుజించుచూ, మరో చేతితో పళ్ళమును గట్టిగా పట్టుకోవాలి. లేకుంటే పళ్ళెము తిరుగుచు అందులో ఉన్న పిడికెడు అన్నం నేలపాలగును. పళ్ళెం కన్నా గిన్నె విలువ ఎక్కువ గిన్నెలో నీరు స్నానం చేయుటకు, ముఖం కడుకుటకు, నీరు త్రాగుటకు అన్నింటికి ఆగిన్నే ఆధారం. భోజన సమయంలో ఆగిన్నెలో పప్పు లేదా కూర వడ్డించేవారు. జైలులో ఇంగ్లీష్ వారి పద్దతి ఇది.

గదిలోపలనే కోల్తారు పూసిన రెండు డబ్బాలు బాత్‌రూమ్‌కు వెళ్ళటానికి ఉపయోగించేవారు. ఉదయం, సాయంకాలం రెండుపూటలా ఒక పనివాడు వచ్చి బాత్‌రూమ్‌ను

శుభ్రం చేసేవాడు. మాగదికి పక్కగా మరుగుదొడ్డి పోవు నదుపాయం ఉంది. ఆచిన్న గదిలో ఆదుర్గంధం అనుభవించాల్సివచ్చేది. ఆచిన్న గదిలోనే ఆహారం భుజించుట, రాత్రి పడుకొనుట, ఆదుర్గంధం ఆ అనుభవాలను వర్ణించ అవసరం లేదేమో.

అది ఎండాకాలం నా చిన్నగదిలోకి ఏమాత్రం గాలి రాకుండా నిషేదించారు జైలు అధికారులు. సూర్యకిరణాలు స్వేచ్ఛగా నా గదిలో నిలకడగా ఉంటాయి. గదిలోని వేడికి నా శరీరం నుండి ఆవిరి పుట్టేది. అప్పుడు చెప్పలేనంత దాహం అయ్యేది. దాహం తీర్చుకొనుటకు వేడినీళ్ళే గతి. శరీరం అంతా చెమటతో నిండిపోయేది. కొంతమంది గది ముందు మట్టి కుండలలో నీరు ఉండేది. అట్టివారు తమ పూర్వజన్మ తపస్సు ఫలితమని తలచేవారు. నా కష్టం చూసి జైలు డాక్టరు భాదపడి ఆయన నాకై ఒక మట్టికుండ సంపాదించడానికి ప్రయత్నించెను. కాని దొరకలేదు. ఎంతో కష్టపడగా డాక్టరు మాట మీద జైలు అధికారి ఎక్కడినుండో మట్టికుండ నాగది ముందు పెట్టెను.

రాత్రిపూట ఒక కంబళిని నెలమీద పరచుకొని, మరొక కంబళినీ ఉపయోగించడం నరకం. శరీరం చల్లదనాన్ని కోరుకునేది. వర్షం వచ్చినపుడు మా ఆనందం చెప్పలేనంతగా ఉండేది. అయినా అప్పుడు అప్పుడు ఒక బాధ ఉండేది. గాలివాన

వచ్చినపుడు దుమ్ముధూళితో వర్షపు నీటితో నాగది చిన్న జలాశయముగా మారేది. అపుడు తడి కంబళిని తీసుకొని గది మూల కూర్చొని కునుకుపాట్లు తప్ప వేరే గత్యంతరం ఉండేదికాదు. ప్రకృతి అనుకూలంగా ఉన్న నేల తడి ఆరిపోయేదాకా ఎదురుచూసేవాడ్ని. మరుగుదొడ్డి దగ్గర కొద్దిగా పొడిగా ఉండేది. అక్కడ కంబళి పరుచుకుని పడుకొనుటకు నాకు ఇష్టం లేదు. ఇబ్బందిగా ఉన్నా రాత్రిపూట గదిలోని ఆవిరి మొత్తం బయటనుంచి వచ్చే చల్లని గాలికి మాయమైపోయేది. అదినాకు చాలా ఇష్టం.

ఉదయం **4-15** నిముషాలకు గంట కొట్టేవారు. ఖైదీలను లేపుటకు ఇది మొదటిగంట. తర్వాత మళ్ళా కొద్ది నిముషాలలో తిరిగి గంట కొట్టేవారు. ఖైదీలు మొహం కాళ్ళు చేతులు కడుకునేవారు. ముఖం కడుక్కుని 'లఫ్సీ' తిని పనులు ప్రారంభిచేవారు. లఫ్సీ అంటే గంజితో కలిపిన అన్నం. బెంగాలీలకు లఫ్సీ మంచి ఆహారం. అన్ని గంటలు కొట్టినపుడు నిద్రించటం అసంభవం అని నేను కూడా నిద్రలేచేవాణ్ణి. మొహం కడుకునేలోపే 'లఫ్సీ' నాగదికి వచ్చేది. దానిని మొదట నేను తినలేదు. కళ్ళు మాత్రమే ఆ 'లఫ్సీ'ను చూసేవి. కాని రోజులు గడిచిన తరువాత తినటం ప్రారంభించాను. మిగతా ఆహారం అంత వ్యర్థం. ఆకలిముందు రుచికి స్థానం లేదు. మనస్సును

స్థిరపరచుకుని తినాలి.

విచారణ సమయంలో ఉన్న ఖైదీలను శిక్షించకూడదు. అది చట్టవిరుద్ధం కాని స్వదేశీ వందేమాతరం పేరుమీద తప్పుచేసి వచ్చిన ఖైదీలకు ఎలాంటి నియమనిభంధనలు వర్తించవు.

నా జైలు జీవిత సమయంలో డాక్టరు డేలే సహాయం సూపరెండెంట్ ఉభయులు సాధరణముగా ప్రతిదినం నాగదికి వచ్చి నాతో కొంత సంభాషించి వెళ్ళేవారు. మొదటి నుంచి వారి స్నేహం పొందితిని. వారు అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పేవాణ్ణి. వారు ఏమి చెప్పినా మెల్లగా వింటుండేవాణ్ణి. ఒకటి రెండు మాటలు మాత్రమే మాట్లాడే వాణ్ణి. నేను అలా ఉన్న వారు నాగదికి రావటం మానలేదు.



ఒకనాడు డాక్టరు డేలేదొర నాతో ఇలా అన్నాడు. నేను సహాయ సూపరిండెంట్‌తో చెప్తాను. నువ్వు ప్రతిరోజు ఉదయం, సాయంకాలం రెండు పూటలా గదిముందు ఉన్న ఖాళీస్థలంలో నడుచుటకు పెద్దదొర నుండి అనుమతి సంపాదించమని. రోజంతా నువ్వు ఆచిన్నగదిలో బందింపబడి ఉండుట నాకిష్టంలేదు. అందువల్ల మనస్సు, దేహం పాడవకుండా నీకు కొంత విశ్రాంతి కలుగుతుంది అని నా భావన.

రెండు రోజులు నాకు గదిముందు ఉదయం సాయం కాలం నడిచేందుకు అనుమతి లభించింది. ఇంతసేపు అని

కాలపరిమితిలేదు. ఆనాటినుండి ఉదయం గంట సాయంకాలం పదినిముషాలు నడిచేవాడ్ని. అలా నడవటం ప్రారంభించిన నాటినుండి నాలో ఒక కొత్త ఉత్సాహం మొదలైంది. గదిముందు ఉన్న ఖాళీ స్థలంకు ఇరుప్రక్కల గోడలు ఉండేవి. నడుస్తూ ఉపనిషత్తులలోని మంత్రాలు వల్లించేవాణ్ణి. ఖైదీల రాకపోకలు కూడా గమనించేవాణ్ణి. సర్వకార్యములందు నారాయణుడే అను మూల సత్యం తెలుసుకొనుటకు ప్రయత్నించేవాణ్ణి. సర్వజీవులలో, సర్వభూతాలలో ఆ పరబ్రహ్మ కొలువై ఉన్నాడని భావించేవాణ్ణి. ఈ విధంగా తలచినపుడు జైలు జైలులాగా అనిపించలేదు. ఇనుప కమ్మల తలుపు, గోడలు, చెట్టు సామాన్యవస్తువులుగా అన్ని చైతన్యపూర్ణముగా నాకు తోచినవి. నిర్లిప్తముగా ఆత్మనందంలో నిమగ్నమై ఉండేవాణ్ణి. ఆభావం వల్ల ఎవరో నన్ను కౌగిలించుకొన్నట్లు, భగవంతుడు ఆనందంతో వేణుగానం చేస్తున్నట్లు అనిపించేది. దాన్ని వర్ణింపశక్తినాకు లేదు. నామీద పడిన హత్యారోపం గూర్చి చింతనాకు లేదు. భగవంతుడు ఉత్తముడు ఏదో ఉత్తమమైన పనికోసం నన్ను ఇక్కడకు తీసుకునివచ్చాడు. ఇక్కడనుండి నిశ్చయముగా బయటకు వెళ్లుదును. ఆవిశ్వాసం ధృడంగా ఉంది.

నాకు ఒకసారి జ్వరం వచ్చింది. అది వర్షాకాలం. నాకు

ఆసుపత్రికి వెళ్ళుటకుగాని, ఔషదం తీసుకొనుటకుగాని ఇష్టంలేదు. మందు తీసుకొనుటలో నాకు ఏమాత్రం విశ్వాసం లేదు. రోగం కఠినం కానప్పుడు ప్రకృతి యొక్క సాధారణ క్రియ వల్లనే తగ్గునని నా నమ్మకం.

వర్షాకాలపు గాలుల వల్ల అనారోగ్యం వచ్చినది. దానిని యోగబలముతో తగ్గించుకోవాలని నా మనస్సు కుతూహలపడుతున్నది. కాని డాక్టర్ ఎమరేసస్ దొరగారు నా మీద ఉన్న ప్రేమతో నా భాద అర్ధం చేసుకొని గట్టి పట్టుదలతో ఆసుపత్రికి పోవలసిన అవసరం నాకు తెలిపి నన్ను అసుపత్రికి తీసుకునివెళ్ళిరి. అక్కడ నా ఆహార భాద్యతలను స్వయంగా చూసుకోలేను. వర్షకాలం కాబట్టి నాగదికి మళ్ళీ వెళితే ఆరోగ్యం మళ్ళీ చెడిపోతుందని వారు నన్ను ఆసుపత్రిలో ఉంచుటకు బలవంత పెట్టిరి. కాని నేనే కావాలని జైలుకు తిరిగి వెళ్ళిపోయితిని.

విదేశాలలో జైలు పరిపాలన విధానాలకు, మన భారతదేశ జైలు పరిపాలన విధానాలకు ఎంతో వ్యత్యాస ముందని, విదేశాలలో మనుషులు ఎంతో దుర్మార్గములను, దొంగతనాలను, నానా విధములైన నేరములు చేయుదురని, వారిని సన్మార్గంలో పెట్టటానికి జైలులో ఉంచుదురని, అదే మన భారతదేశపు ప్రజలు చదువురాని వారని పొట్టకూటికోసం

దొంగతనం చేయుదురని, విదేశీయులకన్నా మన ఖైదీలే మంచివారని శ్రీ అరవిందులవారి అభిప్రాయం. ఈ భావాన్ని జైలు అధికారులు కూడా ఒప్పుకున్నారు.

డాక్టరు డేలేదొరగారు ఇలా అన్నారు. భారతదేశంలోని సంస్కృతిగల పెద్దమనుష్యులు పండితులు, పామరులు, రైతులను చూసిన అనుభవంతో చెప్పుతున్నాను ఏమిటంటే మాదేశపు ప్రజలకంటే భారతదేశపు పౌరులు ఎన్నోరెట్లు ఉత్తమమైనవారని నా అభిప్రాయం.

ఆలీపూర్ కేసులో ఒక ముద్దాయి అయిన గోస్వామి అను యువకుడు తాను తప్పు చేశానని పోలీసువాళ్ళకు చెప్పెను. అంతేకాక గోస్వామి పోలీస్ అధికారులతో ఇలా చెప్పెను. ఖైదీలందరిని ఒక చోటనే ఉంచిన కేసు విషయంలో ఎక్కువ సాయం చేయుటకు వీలుపడుతుందని, ఇతరు మనసులో ఉన్న విషయం కూడా తాను గ్రహింతునని, మరి కొంతమందిని ప్రభుత్వ పక్షమున సాక్షులుగా వచ్చునట్లు ప్రయత్నిస్తానని, ఏకాంతముగా ఉన్న ఖైదీలను ఒక చోటికి తీసుకురావాలని పోలీస్ అధికారులతో గోస్వామి విన్నవించెను.

గోస్వామి విన్నపాన్ని పోలీసులు వెంటనే అమలుపరిచిరి. శ్రీ అరవిందులవారు కూడా మిగతా ఖైదీలతో కాలం గడపవలసిన పరిస్థితి వచ్చింది. మిగతా వారితో ఉండటంవల్ల

తన యోగ సాధనకు భంగం కల్గుతుందని శ్రీ అరవిందులవారి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని శ్రీ అరవిందులవారి మాటల్లో చదవండి.

గోస్వామి ఎమర్సన్ దొరగారిని వేడుకొని ఈ మార్పును కల్గించమని డాక్టరు డేలే మాకు తెలిపెను. డేలే మాటలు నిజం కావచ్చు ఎందుకంటే ఈ మార్పువల్లనేను తప్ప మిగిలిన వారందరూ ఎంతో ఆనందించిరి. నాకు మాత్రం ఇతరులతో కలసి ఉండటం ఇష్టం లేదు. ఆ సమయంలోనే నా సాధన ఎక్కువగా సాగుతున్నది. మనసు శాంతిలో ఉన్నదని, కొత్తవారితో కలిస్తే వారివల్ల తనకి ఏదోరకంగా ఇబ్బంది కల్గుతుందని అరవిందులవారి అభిప్రాయం వారితో నన్ను కలిపిరి. ఇంచుమించు రాత్రి రెండు, మూడు గంటలవరకు ఎవరూ నిద్రించేవారు కాదు. విరుద్ధమైన సంభాషనలు, నవ్వులు, పాటలు నిరంతరం ఉండేవి. నిశ్శబ్ధంగా ఉన్న జైలు ఒక్కసారిగా సందడిగా మారింది.



ఆలీపూర్ బాంబు కేసులో అరవిందులు వారితో చాలామంది ఉన్నారు వారిలో ఒకరు ఉపేంద్రనాథ్ బందోపాధ్యాయ . 'విప్లవకారుని స్మృతి కథనములు అను గ్రంథం వీరు రచించిరి. అందులో జైలులోని అనుభవాలు తోటి ఖైదీల ప్రవర్తనలు వర్ణిస్తూ అరవిందులవారిని గూర్చి

కూడా ఇలా తన పుస్తకంలో వ్రాసారు.

ఈ ఘర్షణకు ఎలాంటి సంబంధం లేని మానవ మహాత్ముడు మాలో ఒక్కరు మాత్రమే. వారే శ్రీ అరవిందులవారు. వారిని గూర్చి ఎన్నో వింత కథలు జైలు కాపలాదారులనుంచి విన్నాను. వారు అన్నం తినరని ఒక వాధన కూడాకలదు. వారికి మతి కూడా భ్రమించినదిని కొందరు తలచినారు. చీమలను ఇంకా కొన్ని పురుగులను వారి భోజన పళ్ళెంనుండి ఆహారంతిననిచ్చేవారని నాకు తెలిసినది. నిజం కనుక్కుందామని పలుమార్లు ప్రయత్నించితిని, కాని ఆవిషయం వారిని అడుగుటకు నాకు ధైర్యం చాలలేదు. వారి తల వెంట్రుకలు మెరుస్తున్నాయి. జైలులో మాకు తలనూనె నిషేధం, నా మనసుకు ఈ విషయం కలవరముగా అనిపించి. సాహసించి అరవిందులవారిని అడిగితిని 'మీరు తలకు నూనె రాసెదరా! నేను స్నానమే చేయను అని వారు జవాబు ఇచ్చారు. అయితే మీ తల వెంట్రుకలు ఎందుకు నిగనిగలాడుతున్నాయి అని వారిని అడుగగా 'నేను ఆధ్యాత్మికంగా అభివృద్ధి పొందేకొలది కొన్ని భౌతిక పరివర్తనాలు నాయందు జరుగుతున్నవి. నా వెంట్రుకలు శరీరం నుండి కొవ్వును సంగ్రహించుకొనుచున్నవి అని వారు నాతో చెప్పిరి.

ఈ విధములైన అద్భుతములను శ్రీ అరవిందునిలో ఎక్కువగా చూచితిని. ఒకే విషయమున మనస్సును కేంద్రీకరించుట, దానియందే మనస్సు నిలుపుట, దాని వల్ల కలుగు లాభనష్టాలు నాకు తెలియవు. శ్రీ అరవిందులవారిని అడిగే ధైర్యం మాలో ఎవరికీ లేదు. అయినా ఎలాగో మాలో చిన్నవాడు అయిన సచిన్ అనువానిని పంపితిమి

సచిన్ అరవిందులవారిని సమీపించి ఇలా అడిగెను.

"మీ ఆధ్యాత్మిక సాధనవల్ల మీకేమి లాభం? మీరేమి పొందితిరి?" శ్రీ అరవిందులవారు తన హస్తాలను సచిన్ భుజంపై ఉంచి ఇలా సమాధానం చెప్పారు.



"ఎందుకు? దేనికొరకు నేను అన్వేషిస్తున్నానో అది నాకు దొరికినది" అని తెలిపెను.

మాలో కొంత ధైర్యం వచ్చినది. మేమందరం శ్రీ అరవిందులవారి చుట్టు చేరితిమి వారి యొక్క అనుభవాలు తెలుసుకోవాలని. అంతరంగమున జరిగిన సంఘర్షణ, దాని అనుభవం శ్రీ అరవిందులవారు తెలిపినారు. మాకు అంతగా వారి చెప్పినది బోధ పడలేదు. కాని శ్రీ అరవిందులవారు ఒక గొప్ప పురుషుడని నేను కనిపెట్టితిని. తాంత్రిక విద్య గూర్చి ఎక్కడ తెలుసుకున్నారు అని అడిగితిమి. అరవిందులవారు ఇలా అన్నారు.

"నాకు ఎలాంటి మంత్రములు తాంత్రిక విద్యలు తెలియవు. కొంత భవిష్యత్తు తెలుసు. నేను ఏ దోషము లేక విడుదల అవుదును" అని తెలిపిరి.

ప్రభుత్వం తరఫున కేసు వాదించేందుకు కలకత్తా ప్రభుత్వంవారు నెలకు వెయ్యి రూపాయల జీతంకు పనిచేయుటకు మద్రాసు నుండి ఒక లాయర్ నార్టన్‌ను పంపించింది. ఆ కాలంలో వెయ్యి రూపాయలంటే ఎంతో ఎక్కువ. అయినా ప్రభుత్వం కేసు ఎలాగైనా గెలవాలని ~~ఈ~~ పనికి పూనుకుంది. అయితే అందుకు అరవిందుల వారు తరఫున వాదించేందుకు లాయర్ కొరకు శ్రీ అరవిందులవారి యొక్క చెల్లెలు సరోజినీదేవి దేశప్రజలను ధనసహాయం కోరింది. శ్రీ అరవిందులవారు గూర్చి తెలిసిన ప్రతిఒక్కరు ధనసహాయం చేసిరి. దాదాపు 30,000 వేల రూపాయలు జమఅయ్యాయి. దానివల్ల శ్రీ అరవిందుల వారి మీద ప్రజలకున్న నమ్మకం తెలుస్తుంది. అంతేగాక శ్రీ అరవిందుల నిర్దోషత్వం మీద వారికి విశ్వాసం ఉంది.

శ్రీ అరవిందుల వారి తరఫున వాదించేందుకు మొదలు వ్యోమకేశ చక్రవర్తి గారిని నియమించాలని ప్రయత్నం జరిగినది. కాని చివరకు చిత్తరంజనుదాసు న్యాయవాదిగా నియమితులైరి. అప్పటి నుంచి చిత్తరంజన్ దాసు పేరు భారతదేశ ప్రజలకు సుపరిచితమైనది.

శ్రీ అరవిందులవారిని అరెస్ట్ చేసి జైలులో ఉంచటంవల్ల ఉపకారమే జరిగినది అని శ్రీ అరవిందులవారు వ్రాసిన శ్రీ అరవిందోపన్యాసం వల్ల మనకు స్పష్టంగా తెలుస్తుంది. వ్యాసంలో ఉన్నది కింద తెలుపుతున్నాము.

"నన్ను పోలీసువారు అరెస్ట్ చేసిన క్షణం ఈశ్వరునిపై నా నమ్మకం, విశ్వాసం చలించినది. నేను ఎంతో సంకోచించితిని. ఈశ్వరుని కృప నా మీద ఉంటే నాకు ఇలా జరుగుట ఏమిటి అన్న సందేహం నాలో జ్వలించినది. నా దేశ స్వాతంత్రం కొరకు నేను నెరవేరవలసినవి ఎన్నో కార్యాలు ఉన్నవి. అయితే ఇప్పుడు ఇలా నన్ను కట్టివేసితివి ఎలా? అని హృదయంలో ఆవేదన పడితిని. అయితే నా హృదయవేణి "వేచి ఉండుము, సహనంతో ఉండుము అన్న అంతరంగం నేను వింటిని. లాలబజారు నుంచి అలీపూరుకు నన్ను తీసుకుపోతున్నారు. మనుష్యుల నుండి ఏకాంత కారాగారం తీసుకుపోతున్నారు. నాకు శ్రీకృష్ణ దర్శనం కలుగుటకై ఈ జగన్నాటకం జరుగుతున్నదని నేను మొదట్లో తెలుసుకోలేకపోయాను. నా అంతర్వాణిని వినుటకై నేను ఏకాగ్రతతో ఉండటం మొదలుపెట్టాను.

నన్ను పోలీసువారు పట్టుకొనుటకు నెల ముందు, నా అంతర్వాణి నాకు ఒక సందేశం చెప్పినది. నేను అంత జాగురుడమై ఉండక పోవటం వల్ల, నేను ఆ సందేశం వినలేదు, పట్టించుకోలేదు.

నా హృదయంలో, నాలో ఉన్న అహంకారమే ఇందుకు కారణం. తర్వాత భగవంతుడు మళ్ళీ నాపై కరుణ కురిపించటానికి నన్ను ఏకాంత కారగారవాసుణ్ణి చేసెను. నేను అనుకున్న కార్యం కాకుండ, నేను సాధించవలసిన కార్యం మరొకటి ఉన్నదని ఆ కార్యానికి నన్ను భగవంతుడు సిద్ధపరుస్తున్నాడని మెల్లమెల్లగా నేను తెలుసుకుంటిని. అందుకు నేను జైలుకు వచ్చితిని.

రాగద్వేషాల నుండి విముక్తి కల్గించటమే లేక వైరాగ్యం నందు నన్ను పడవేయుటకై ఆ పరమేశ్వరుడు ఇలా చేశాడు. హిందూమతం గూర్చి, సనాతన ధర్మం గూర్చి నాకు ఇప్పుడు పూర్తిగా అర్థం అయినది. చాలాసార్లు మనం ఎన్నో మాటలు, ప్రసంగాలు చేశాము కాని వాటి అర్థాలు తెలుసుకోకుండా మాట్లాడుతున్నాము. సనాతన ధర్మం జీవిత సర్వస్వమై ఉన్నది.

ఆ తర్వాత భగవంతుడు నాకు ఇలా మేలు కలుగజేశాడు.

హిందూమతం యొక్క మూల సత్యమును నేను గుర్తించునట్లు చేశాడు. నాపై జైలర్ల హృదయాన్ని మార్చి నా పట్ల సుముఖులుగా ఉండునట్లు చేశాడు. జైలు నాకు జైలులా, గోడలు గోడలుగా, తలుపులు తలుపులుగా కాక సర్వం నాకు శ్రీకృష్ణునిగా కనిపించుట, వాసుదేవులవారు నా కళ్ళ ముందు తిరుగుతున్న దృశ్యాలే ఎటు చూసినా.

క్రింది కోర్టులో కేసు విచారణ ప్రారంభమై జడ్జి ఎదుటకు

మేము హాజరైతిమి. అప్పుడు కూడా నా అంతరంగం ఇలా అంటున్నది. జడ్జిని చూడుము. న్యాయవాదిని చూడుము. నేను చూసినది, వారు వారు కాదు. వారు సాక్షాత్తు వాసుదేవులవారు. ఎటుచూసినా శ్రీకృష్ణులవారే నా దృష్టికి కనిపిస్తున్నారు. ఇప్పుడు నాకు భయమెందుకు? అందరిలో ఉన్నది నేనే అని శ్రీకృష్ణభగవానుడు నాకు తెలుపుతున్నాడు. నీపై మోపిన అభియోగం నేను చూచెదను. ఈ కార్యం అంతా నాచే నడుపబడుతున్నది అంతకంటే మరేమి లేదు.

కోర్టులో జరుగుతున్నది నేను ఊహించినదే కాదు. నా తరపున వాదించు న్యాయవాది ఎవరో అనుకున్నా కాని తీరా చూస్తే నా స్నేహితుడే నా న్యాయవాది. అతని పేరు చిత్తరంజన్‌దాసు. కేసు గూర్చి నేను నా మిత్రునితో ఏమి మాట్లాడలేదు, కేవలం నిలుచోని ఉంటిని. అంతా ఆ కృష్ణభగవానుడు నడిపిస్తున్నాడు. నీకు ఏ కష్టం కష్టం కాదు. నీయందు అసాధ్యమైన పని లేదు.



అటుపై నేను ఏకాంత కారాగార బందీనే అయితిని. నాయందు తీర్పు ఏమిటో నాకు తెలుసు. దాని అవసరం కూడా లేదు. నాకు ఇంతకు ముందు ఎన్నో సంశయాలు ఉండేవి. ఇప్పుడు ఏమీ లేవు. కేవలం భగవంతుని ధ్యాస తప్ప.

భగవంతుణ్ని దర్శించినప్పుడు, భక్తునికి ఉండ వలసిన లక్షణాలు కాని, జ్ఞాని పాటించవలసిన నియమాలు నాలో లేవు. అయినా పరమేశ్వర కృపాకటాక్షములకు నేను పాత్రుడనైతిని.

పరమేశ్వరుణ్ని నేను కోరేది ఒక్కటే. "నువ్వు ఉన్నావన్నది నిజం. నాకు ముక్తి ప్రసాదించువాడివి నువ్వు మాత్రమే. నేను జీవించి ఉండి సాధించవలసిన కార్యం ఏమి? ఎవరికొరకు ఈ జీవితం? యోగానికై, సాధనకై కొంత కాలం గడిపితిని. దానివల్ల ఏమి లభించినది? ఏమి నష్టపోతిని ఇప్పుడు అప్రస్తుతం.

కావున నాకు ఇప్పుడు సత్యము గోచరిస్తున్నది. నేను చేయవలసిన కార్యం తెలుస్తున్నది. దానికై మాత్రమే నేను కృషి చేసెదను. నేను సంతృప్తుడనై ఉన్నాను.

తుదకు ఎన్నో వాదనలు, ప్రతివాదనలు జరిగిన తరువాత శ్రీ అరవిందులవారిని నిర్దోషి అని ప్రకటించిరి. ప్రభుత్వం తాను అనుకున్న కార్యం నెరవేరలేదు. 1909, మే 5వ తేదీన శ్రీఅరవిందులవారు విడుదల అయినారు.



శ్రీ అరవిందులవారిని అరెస్టు తర్వాత రక్షకభటులు తీసిన చిత్రం మరియు ఇతర వివరాలు



చిత్తరంజన్ దాసు



ఉత్తాపూర్‌లో 1908 ఏప్రియల్, 5వ తేదీన
జాతీయవాదుల ఏర్పాటు చేసిన సభ



శ్రీ అరవిందులవారిని పట్టుకొచ్చిన న్యాయస్థానమిదే



శ్రీ అరవిందులవారిని
ఉంచిన కారాగారం







జైలులో నిర్బధించిన తరువాత శ్రీ అరవిందులవారు



1909, సెప్టెంబరు మాసంలో శ్రీ అరవిందులవారు తన సహచరులతో





శ్రీ
బరీంద్రకుమార్
ఘోష్

శ్రీ కృష్ణుని కృపచే శ్రీ అరవిందుల వారు క్షేమంగా జైలు నుంచి విడుదల అయి తన నిజాయితీని నిరూపించుకున్నారు.

శ్రీ అరవిందుల వారు జైలు నుంచి బయటకు వచ్చినప్పుడు దేశరాజకీయ పరిస్థితి ఎంతో దుర్భిక్షంగా ఉంది. ఎందుకంటే దాదాపుగా దేశ స్వాతంత్ర్యంలో ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని పాల్గొన్న నాయకులందరు కారాగారంలో బందీలుగా ఉన్నారు. అందులో ప్రముఖుడు గంగాధర్ తిలక్ తన పత్రిక కేసరిలో రాజద్రోహంగా ఉండే వ్యాసాలు ప్రకటించారని జైలులో బందీగా చేశారు, ఇలా ఎందరినో...



ఈ పరిస్థితులను శ్రీ అరవిందులవారు జైలు నుంచి బయటకు రాగానే గమనించారు. దేశం కోసం మళ్ళీ ఉక్కుపాదం బిగించాలని నిర్ణయించుకున్నారు. 1908వ సం॥లో 'వందేమాతరం' అనే పత్రిక ఆగిపోయింది. అందువల్ల మళ్ళీ ఒక పత్రిక స్థాపించి ప్రజలకు నిజానిజాలు తెలియచెప్పాలని శ్రీ అరవిందులవారు నిర్ణయించుకున్నారు. ఇది వరకు లేని ఆధ్యాత్మిక చింతన, దైవభావన ఇప్పుడు శ్రీ అరవిందులవారిలో ఉన్నాయి. పత్రికను ఆధ్యాత్మిక దృష్టితో ప్రకటించాలని, అందుకు అనుగుణంగా పత్రిక పేరు 'కర్మయోగి' అని పేరు పెట్టారు. ఇంగ్లీషులో ముద్రించారు. బెంగాలీ భాషలో 'ధర్మ' అనే పేరుతో పత్రికను ప్రారంభించారు. ఈ రెండు

పత్రికలను నెలరోజుల లోపలే ప్రారంభించి, దేశం మీద తనకున్న భక్తి, గౌరవం చాటి చెప్పారు. పత్రిక ముఖచిత్రం మీద కృష్ణుడుతో ఉన్న అర్జునుని ఫోటో ముద్రించారు.

కర్మయోగి పత్రిక ఏ సంకల్పంతో ప్రారంభించారో శ్రీ అరవిందుల మాటల్లో కింద పొందుపరచాను.

1. పాశ్చాత్య సంపర్కము వల్ల జాతీయ స్వధర్మములు నశించినవి. చాతుర్వర్ణము వారు ఛేదించి వర్ణసంకర మేర్పడినది.

2. మన జాతీయత, మత, విద్య, వైజ్ఞానం నానారూపములలో ఉన్నది. అన్ని మతములు, మతనాయకులు, ధర్మానుష్ఠానములను సమన్వయ పరచి, అందులోని జీవ రహస్యములను గుర్తించి ప్రజలలో చైతన్యం తేవాలి.



3. పాశ్చాత్యులు మతమును నిత్య జీవితం నుండి విడదీసి విజయవంతులమైనామని పొంగిపోతున్నారు. "మతము దాని స్థానములోనే ఉన్నంత వరకు మంచిది. కాని రాజకీయ శాస్త్ర, వ్యాపార, సంబంధములోకి ప్రవేశించిన, దాని యొక్క ఫలితము ఊహింపలేము.

మతమును పాశ్యాత్యులు ఏ విధంగా గ్రహించారో, అది మాత్రం ముమ్మాటికి తప్పు. భగవంతుడు ఈ జగత్తును నడిపిస్తున్నాడన్నది నిజం. అది కాదు అని ఆ భగవంతుని ఒక మూలకు పెట్టి, మన జీవనము, దానితో ముడిపెట్టుకొని ఉన్న ఎన్నో

విషయాలు మానవునికి సంబంధించినవి అని వాటితో భగవంతునికి ఎలాంటి సంబంధం లేదని గ్రహించుట తప్పు. భగవంతుడు సర్వవ్యాపి.

4. భారతదేశపు స్వాతంత్రపు లక్ష్యం ముందు బ్రిటీష్‌వారి యొక్క ఎలాంటి ఎత్తుగడలుకాని, అణచివేత కాని, బానిసత్వపు చూపు పనికిరావు. భౌతికశక్తులకు లొంగి, మాలో ఉన్న ఆధ్యాత్మిక భావనలు మేము వదులుకోలేము. మా జాతిలో, మా నరనరాల్లో ఉన్న హిందుత్వపు భావనలు ఎంతో గొప్పవి. దాన్ని ఏ శక్తి అంతం చెయ్యలేదు.

5. ఆత్మబలంకు మించిన బలం మరొక్కటి లేదు. ఆ బలం నిత్యమైనది. దానితో ఎలాంటి కార్యమైన సాధించవచ్చు.



'కర్మయోగి' పత్రిక కూడ వందేమాతరం పత్రిక లాగా అతి కొద్దిరోజులలోనే ప్రజా అభిమానం పొందింది. పేదలకొరకు అతి తక్కువ ధరలో అమ్మటం, కొద్దిగా పాడుపడిన పేపర్ ఉపయోగించి, ప్రజలందరికి పత్రిక చేరువకావాలన్న ఉద్దేశంతో పేపర్ నాణ్యతలో రాజీపడి ప్రజలందరికి పత్రికను చేరవేశారు అరవిందులవారు.

కర్మయోగి 5వ సంచిక వేసే సమయానికి ఏ క్షణం ఏమి జరుగుతుందో అని శ్రీ అరవిందులవారు 1909 జూలై 19వ తేదీ 'నా దేశములకు ఒక బహిరంగ లేఖ' అని ఒక లేఖ రాసినారు. ఆ

లేఖలో ఉన్న విషయాలు కింద తెలియజేస్తున్నాము.

"నేను విదేశాలలో చదువు అభ్యసించిన నా పద్ధతులు, నా వ్యవహారాలు విదేశీయుల వలె ఉన్నాయని ఒక పుకారు. ఈ విషయం కలకత్తా పోలీసువారు ప్రభుత్వంకు చెప్పారని ఓ వదంతి. అందువల్ల నా దేశం వారికి, ముఖ్యంగా జాతీయ పక్ష సిద్ధాంతాలను నమ్మేవారికి, అందరికి తెలిపేందుకు, చెప్పేందుకు ఒక ఉత్తరము రాసుట మంచిదని ఆలోచించి ఈ లేఖ రాస్తున్నాను.

నేను విదేశాల్లో ఉన్నప్పటికి నా స్వదేశం యొక్క స్థితిగతులు అన్ని నాకు తెలుసు. జాతీయ వాదుల కిప్పుడు కష్టమైన కాలం. వారు ఎలాంటి నిరుత్సాహం పొందవద్దు.



ఇప్పుడు జాతీయపక్షము బలంగానే ఉన్నది కానీ మార్గము తెలియక నాయకులు లేక మరుగునపడుతున్నది. మార్గం అంటారా మనసులో ఎలాగైనా కనుగొనవచ్చు. నాయకుణ్ణి భగవంతుడు నియమించవలెను. భౌతిక బలం వల్ల మనం ఎంతోదూరం ప్రయాణించలేము. ఆధ్యాత్మికంగా మనం ఎదిగినప్పుడే జీవితం కాని, సంఘం కాని, దేశం కాని, ముందుకు సాగుతుంది. నాయకులకు సహనశక్తి అవసరం. నాగరికకాలంలో ప్రభుత్వం తన పేరు, ప్రతిష్టలను పొగొట్టుకోవటానికి ఇష్టపడనిది అయితే, మనం చేసే ప్రతి కార్యం న్యాయధర్మవిరుద్ధమని చెప్పవు.

మనం అందరం ఏకమయి, ఒక నడవడిక మీద సంఘాన్ని, దేశాన్ని నడిపించాలి. అందువల్ల మన ఉద్దేశాలు ప్రచారం ముందుకు తీసుకువెళతాయి. ఇటీవల జరిగిన హింసాకాండకు, హత్యలకు మనకు ఏలాంటి సంబంధము లేదు.

మన లక్ష్యం, ఆదర్శం ఒక్కటే స్వరాజ్యాన్ని స్వయంగా మనమే పాలించుకోవటం. ప్రతీ జాతికి కనీసం ఉండవలసిన హక్కు. వారు (విదేశీయులు) మన కంటే ఏ విషయంలో అయినా ఎంత ముందు ఉన్న, మనం దేశంపై వారికి ఎలాంటి హక్కు లేదు. వారిలోను ఎన్నో లోపాలు ఉన్నాయి. వాటితో మనకు సంబంధము లేదు.మనకు ప్రస్తుతం కావలసినది కార్యాచరణ, ఒక ప్రణాళిక మాత్రమే. దాన్ని అనుసరించి నడిస్తే మన దేశం మనది అవుతుంది. విదేశీయులు వారి యొక్క అధికారాన్ని వదిలి, వారి యొక్క పాలనను విడిచిపెట్టి వెళ్ళుట మంచిది. లేకున్న భవిష్యత్తులో జరిగే సంఘటనలు ఏ దారి తీస్తాయో ఎవరు ఊహిపగలరు?

మన వివాదములు మనమే పరిష్కరించుట, మన అభివృద్ధి మనమే చేసుకొనుట, మన సాంకేతిక, విద్యావిధానాలను మనమే ఏర్పరుచుకొనుట, ఇలా ఎన్నో మనకు మనమే మన పాలనను మనం చేసుకుందాం.

జాతీయ పక్షమునకు నేను సూచించే పద్ధతి ఈ క్రింది విధముగా ఉన్నది.

1. శాసనములను ఏ మాత్రం అతిక్రమించకుండా స్వయం సాహాయ సాత్త్విక నిరోధ పద్ధతి యందు పట్టుదలతో ఉండుట.

2. ప్రభుత్వం పట్ల సుముఖత ప్రదర్శించాలంటే మన అధికారానికి వారు పట్టం కాట్టాలి.

3. దేశీయ మహాసభలకు అందరం ఏకమై (మితవాదులు కూడా) పునర్నిర్మాణం చేయాలి.

4. దేశం మొత్తం రాష్ట్రాలవారిగా కార్యక్రమాలకు నిర్వహించి, స్వరాజ్యస్థాపనలో ఏకం కావాలి.

ఇలా తనకున్న ప్రతిభతో, తాను చూసిన, పొందిన అనుభవాలతో దేశానికి లేఖ రాసి అందరిలోను స్వరాజ్య బీజం మొలకెత్తెలా చేశారు శ్రీ అరవిందులవారు.



1909వ సం॥ శ్రీ అరవిందుల వారు తన భావాలను ఇలా చెప్పి, రాజకీయంగా స్పష్టతను, భౌతికంగా ధైర్యాన్ని ప్రజలకు, నాయకులకు చెప్పారు. గాంధీ పది సం॥ల తర్వాత ఇంచుమించు ఈ సిద్ధాంతాలనే ఎన్నో సభలలో ప్రస్తావించారు. స్వాతంత్ర్యం వచ్చాక ఎన్నో సం॥లు కూడా ఈ సిద్ధాంతాలు అమలులో ఉన్నాయి.

భారతదేశం అంతటా రోజురోజుకు స్థితిగతులు మారుతున్నాయి. విప్లవకారుల చర్యలు ఎక్కువైతున్నాయి. సహనం లేక దారుణ హత్యలకు, కఠినమైన హింసలకు వారు ఒడుగడుతున్నారు. విప్లవకారులను ఎదుర్కొనుటకు ప్రభుత్వం వారు గట్టి నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఎలాంటి సాహసానికైనా సిద్ధంగా

ప్రభుత్వం వ్యవహరిస్తున్నది. జాతీయపక్షము నిలుచుట అసాధ్యమయ్యింది.

మెల్లమెల్లగా శ్రీ అరవిందులవారు యోగాభ్యాసానికి ప్రాధాన్యత ఇస్తూ, ఏకాగ్రత నిష్ఠతో కాలం గడపసాగిరి.

దేశపరిస్థితుల విషయం ఓ ప్రక్కన పెడితే, శ్రీ అరవిందులవారు మాత్రం గడిచిన రెండు సం॥లలో ఆధ్యాత్మికంగా తన ప్రయాణం ప్రారంభించారని చెప్పవచ్చు. ఎలాగంటే జైలులో కలిగిన శ్రీకృష్ణదర్శనమే మనకు నిదర్శనం. వారిని మెల్లగా భౌతిక ప్రపంచం నుండి ఆధ్యాత్మిక ప్రపంచం వైపుకు నడిపిస్తున్నారు శ్రీకృష్ణ భగవాన్. అందుకే కాబోలు తన స్వస్థలం వదిలి దక్షిణ భారతదేశంవైపు అడుగులు వేశారు.





1909లో శ్రీ అరవిందులవారు (జైలునుంచి విడుదల తరువాత)


Registered No. C. 550

ধর্ম

সাপ্তাহিক পত্র।

ధర్మపత్రిక ముఖచిత్రం

**REGISTERED NO. C532.**

**SUBSCRIPTION RUPEES 5.**




**SINGLE COPY ANNAS 2.**

# A WEEKLY REVIEW

OF

**National Religion, Literature, Science, Philosophy, &c.,**

కర్మయోగి పత్రిక ముఖచిత్రం

1910 మార్చి 26వ తేదీ చివరి సంచికగా కర్మయోగి పత్రిక చరిత్ర ముగిసింది.

ఈశ్వరకృప శ్రీఅరవిందుల మీద ఏ ప్రభావం ఏ విధంగా కల్గిందో తెలియదు కాని, శ్రీ అరవిందుల వారు మాత్రం కలకత్తా వదిలిరి. తనకున్న జ్ఞానాన్ని, తనలో ఉన్న అంతర్జ్ఞానంతో ఏకీకృతం చేసినప్పుడు కలకత్తా వదలి, పాండిచ్చేరి వెళ్ళాలని ఓ ఆకాశవాణి పలికిందేమో.

కలకత్తాలో కర్మయోగి పత్రిక ముగియడంతో పాటు తన ప్రయాణం కూడా మారింది. కలకత్తా వదిలి శ్రీ అరవిందులవారు చంద్రనాగూరు పట్టణంలో రెండు నెలలు ఉన్నారు. అటుపై 1910వ సం॥ ఏప్రియల్ 4వ తేదీ పాండిచ్చేరిలో అడుగుపెట్టిరి.



ఇద్దరు శిష్యులతో చంద్రనాగూరు వెళ్ళారని అటుపై వారిని కూడా వదలి ఒంటరిగా పాండిచ్చేరికి వెళ్ళారని సమాచారం. చంద్రనాగూరు పట్టణవాసి తెలియజేయు సంగతి చదవండి.

"శ్రీఅరవిందులవారిలో మార్పు చెప్పలేనిది. మౌనంతో ఏకీభవించి ఆధ్యాత్మికంగా ఉన్నతశిఖరాలకు వెళ్ళినట్లు నాకు ప్రత్యేకంగా అనిపించింది. గంగానది తీరమున వారిని మొదటిసారిగా దర్శించి జన్మ పావనం చేసుకుంటిని. నాకు ఎక్కడలేని శాంతి లభించినది. మా ఇంటికి తీసుకెళ్ళి వారికి తగిన ఏర్పాటు చేశాను. యోగం గూర్చి, వ్యాసుని గూర్చి, శ్రీకృష్ణుని గూర్చి

కొంత నాకు వివరించారు. దాంతో నా ఆధ్యాత్మిక దాహం తీరింది. వారి కంటి నుండి ప్రసరిస్తున్న కాంతిని చూడ శక్తి నాకు లేదు. నడుకలో శబ్దం లేదు. నా అనుభవం ఎంత చెప్పినా సరిపోదు."

ఒక శిష్యునితో పాండిచ్చేరికి ప్రయాణం అయ్యారు. 1910వ సం॥ పాండిచ్చేరిలో తమ పవిత్ర పాదస్పర్శ మోపారు. ప్రప్రధమమున శ్రీకల్వేశెట్టి అను ధనవంతుని ఇంట్లో ఉన్నారు.

1921వ సం॥లో శ్రీ అరవిందులవారు స్వయంగా ఆశ్రమం నిర్మించేవరకు పాండిచ్చేరిలో ఆరు, ఏడు ఇళ్ళు మారినారని సమాచారం.

శ్రీ అరవిందులవారు స్వయంగా తనకు తాను ప్రకటించేవరకు, ప్రభుత్వంకు తెలియదు శ్రీ అరవిందులవారు ఎక్కడ ఉన్నది.

శ్రీ అరవిందుల వారు, రాజకీయునికి దూరమ్వై, ఆధ్యాత్మికసాధనకు దగ్గరైనారు. అరవిందులవారికి ప్రభుత్వం పై అసలు దృష్టిలేదు కాని ప్రభుత్వంవారు మాత్రం శ్రీ అరవిందుల వారిని వదలలేదు.

1909 వ సం॥ జూలై నెలలో శ్రీ అరవిందులవారు రాసిన వ్యాసం రాజద్రోహమని, శ్రీ అరవిందులవారు పాండిచ్చేరిలో ఉన్న సమయంలో వారి మీద ప్రభుత్వం ఎన్నో ఆరోపణలు చేసింది. శ్రీ అరవిందుల వారు భయపడి పాండిచ్చేరి చేరినారని ప్రభుత్వం

ఆరోపించింది. శ్రీ అరవిందుల వారు కలకత్తాలో ఉన్నప్పుడు వారిపై ఎలాంటి చర్యలు తీసుకోలేదు. ఎలాంటి అభియోగాలు తెలుపలేదు. శ్రీ అరవిందుల వారు పాండిచ్చేరి చేరాక కొంతకాలానికి వారిపై రాజద్రోహ ముద్ర మరియు పిరికివాడని ప్రభుత్వం తమ చర్యలను ప్రారంభించింది. కాని న్యాయస్థానములో శ్రీ అరవిందుల వారు నీతి బయటపడింది. ఆ లేఖలో ఎలాంటి తప్పులేదని చెప్పి, దాన్ని ముద్రించిన ముద్రాపకుని విడుదల చేసిరి. ఈ కార్యం చేయడానికి ఈశ్వరకృప కాక మరేమిటి?



ఈ తీరమునుంచే శ్రీ అరవిందులవారు చంద్రనాగూరు నుంచి పాండిచ్చేరికి ప్రయాణమయ్యారు ( 31 మార్చి, 1910 )

1910 నుండి 1911 ఏప్రియల్
వరకు
శ్రీ కల్వేశెట్టి ఇల్లు ప్రథమముగా
శ్రీఅరవిందులవారు
పాండిచ్చేరిలో ఇక్కడే బసచేశారు







బిజ్రోయ్‌నాథ్‌తో కలిసి శ్రీ
అరవిందులవారు పాండిచ్చేరికి
ప్రయాణం చేశారని
సమాచారం





చందనాగూరులో శ్రీ
అరవిందులవారు బసచేసిన
మోతీలాల్‌రాయ్ యొక్క
గృహం



పాండిచ్చేరి సముద్రతీరం

1911 ఏప్రియల్ నుండి 1913 వరకు పాండిచ్చేరిలో శ్రీ అరవిందులు నివసించిన గృహం





తన శిష్యబృందంతో శ్రీ అరవిందులవారు (1911-1920)



శ్రీ అరవిందులవారు (1911-1920)

పాండిచ్చేరి చేరిన తర్వాత శ్రీఅరవిందుల వారు కేవలం ఆధ్యాత్మిక సాధన మీదనే తన దృష్టి కేంద్రీకరించారు. నాలుగు సంవత్సరాలు ఏకాగ్రతతో సాధన చేసి, ఆధ్యాత్మికతలో ఎంతో పురోగతి సంపాదించారు.

తనకు ఎదురైన అనుభవాలు, తాను పొందిన అనుభూతులు, తనకు ఉన్న జిజ్ఞాసకు ఓ రూపం ఇవ్వాలని, 1914వ సం॥ ఆగష్టు 15వ తేదీన 'ఆర్య' అను తత్త్వ విజ్ఞాన మాసపత్రిక ఆంగ్లంలో ప్రారంభించారు. ఇలాంటి మహాప్రయత్నాలు ఇంతకు ముందు ఎవరూ చెయ్యలేదు అన్న రీతిలో ఈ మాసపత్రికను ప్రారంభించారు. ప్రజలకు తన ఆలోచనధోరణిని, భావాలను తెలియజేసారు.



ఆర్యపత్రిక స్థాపించటానికి, అందులో చెప్పే విషయాలు, దాని వెనుక ఉన్న ఉద్దేశాల గూర్చి శ్రీ అరవిందుల వారు ఇలా తన మాటల్లో చెప్పారు.

"జరిగిపోయిన కాలంలో జరిగిన సంఘటనల గూర్చికాని, తాత్కాలికమగు విషయవాంఛల గూర్చి కాని, మతాలు వాటి సిద్ధాంతాల గూర్చి కాని మా పత్రిక స్థాపించడం లక్ష్యం కాదు. భవిష్యత్తుకు పునాది వేయగల ఆలోచనలు, వాటి కోసం మనం చేసే ప్రయత్నం తెలుపుటలో మానవాళికి ఉపయోగపడుటకై ఈ పత్రిక స్థాపించాను.

బాహ్యం అందు మనిషి ఎంత గొప్ప అయిన, అంతర్ముఖుడై అంతరంగంలో ఉన్నతస్థాయికి చేరుకొన్నప్పుడే మానవ జన్మకు సార్థకత లభిస్తుందని, అందుకు ఈ ఆర్య పత్రిక ఉపయోగ పడుతుందని నా భావన, నా నమ్మకం.

మానవుడు జీవితంలో ఓ సంకల్పం ఏర్పర్చుకొని అందుకని సంసిద్ధుడై, ఈశ్వరానుగ్రహంతో ఆధ్యాత్మికంగా ఉన్నతస్థాయికి వెళ్ళాలని నా ఆకాంక్ష.

ఆసియాపై రెండు సార్లు పాశ్చాత్య దేశాల ప్రభావం గట్టిగా పడింది. అందులో మొదటిది గ్రీకు సంప్రదాయంతో కూడి ఉన్నదైన అలెగ్జాండర్ దండయాత్ర.



రెండవది ప్రాగ్దేశపు నీతి, కళ, ఆధ్యాత్మికతపై ఇప్పుడు ఐరోపా దేశపు వాణిజ్యం, రాజకీయ, పరిజ్ఞాన శాస్త్ర సంబంధిత విషయాలు.

పై రెండు సంఘటనలవల్ల రెండు కొత్త విశేషాలు మనకు అవగాహన వస్తాయి. ఇవి ఒకే కాలంలో సంబంధించినవి. తమ వైపరీత్యాలను విశ్లేషించి చూపుట. ఆధ్యాత్మికంగా ఎలాంటి పురోగతి, జ్ఞానం లేని ఐరోపాదేశం, ఆధ్యాత్మికంగా ఉన్నతశిఖరాలలో ఉన్న ఇండియాను శాసించినప్పటికి, భారత దేశం ఎలాంటి పరిస్థితిలో అయినా ఆధ్యాత్మిక మార్గం, చింతన వదిలిపెట్టదు.

మన యొక్క అసమర్థతను మనం బయటపెట్టుకుంటే అది

మన యొక్క విఫలమునకే శ్రీకారం చుట్టుతుంది. అదే జరిగితే ఆధ్యాత్మికంగా మనకు భూమండలంలో మంచి స్థానం ఉండదు.

మానవజన్మ యొక్క ఆధ్యాత్మికతను గుర్తించిన రోజే ఐరోపావారు బాగుపడగలరు. లేకున్న జీవన రహితమగు కట్టుదిట్టముల మధ్య నలిగిపోతారు.

ఆత్మ వికాసమునకు, ఆత్మ యొక్క తత్వం తెలుసు కొనుటలో పురోగతి సాధించుటకు మార్గాలు మా ఆర్యపత్రిక తెలుపుతుంది, అంతేకాక ఆధ్యాత్మ యోగశిక్షణలను కూడా తెలుపుతుంది. నేర్పుతుంది. యోగ మార్గాలను, అందు పాటింపవలసిన నియమాలను వివరిస్తుంది మా పత్రిక.

ప్రపంచంను అజ్ఞానదృష్టితో చూస్తున్నాము, భౌతిక జడమందు లీనమై జ్ఞానచిత్తమును మరచిపోతున్నాము. ఈ ప్రవర్తనను మార్పు చేసి మానవజాతిని రక్షించుటకై ఆర్యపత్రిక మీకు మార్గదర్శి అవుతుంది. మనస్సు, ఆత్మ, ప్రాణము భౌతికంగా ఉన్న, వానియొక్క అంతరార్థం తెలుసుకోలేకపోతే మానవుడు ఎన్ని జన్మలు ఎత్తినా ఏ మాత్రం ప్రయోజనం ఉండదు. నిత్యము సత్యము అయిన దాని తెలుసుకో, అది తెలుసుకోవటానికి ఈ ఆర్య పత్రిక మీకు తోడుగా నిలుస్తుంది.

ఏ కారణమనైతే ఏమి తత్త్వజ్ఞాన ప్రపంచమున ఆర్య పత్రికా దేదీప్యమానముగా వెలిగించిన దివ్యజ్యోతి ఏడవ సం॥నే కొడగట్టినది

1921లో ఆర్య మాసపత్రిక మూతపడింది.

దాదాపుగా ఆరున్నర సం॥లు కొనసాగిన పత్రిక నిలిపివేయుటకు కారణం ఏమై ఉండవచ్చు.

ప్రజలు, అనుచరులు, పాఠకులు.. ఇలా అందరూ మానసికంగా అనుభవించవలసిన, గ్రహింపవలసినదంతా, మాటల రూపంలో భాషగా పత్రికలో వెల్లడించగల్గిన దంతా ప్రకటితమైనదని, ఇంకా కేవలం ఆత్మానుభవం వల్ల, యోగ సాధనవల్ల మాత్రమే ఆత్మసత్యమును తెలుసుకోవాలని కాబోలు శ్రీఅరవిందులవారు ఆర్య పత్రికను కొనసాగించలేదు.

లేదా



తన యొక్క సాధనకు అంతరాయం కలిగిందనో, లేక మళ్ళీ సాధనపై దృష్టి కేంద్రీకరించాలనో శ్రీ అరవిందుల వారు పత్రికను మూసివేశారు.

శ్రీ అరవిందుల వారు ఆర్యపత్రికలో రాసిన వ్యాసాల సారాంశం.

మత, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సామాన్య, సంఘు, భక్తి, కళా జీవన విశేషాలన్నింటిని ఆధ్యాత్మిక దృష్టిలో సమన్వయమొనర్చి, వాని యొక్క అన్యోన్య సంబంధమును పత్రికలో ముద్రించారు. ఈ వ్యాసంలో శ్రీ అరవిందులవారి యొక్క రచనానైపుణ్యాం, సాహిత్యపు పరిమళం ఎంతో అందంగా పాఠకులకు అర్థమవుతుంది.

తాను ఏ లక్ష్యం పెట్టి ఆర్యపత్రిక స్థాపించారో ఆ లక్ష్యాన్నికి ఎందరు స్ఫూర్తి పొందారో తెలియదు కాని, శ్రీఅరవిందులవారు ఇష్టంగానే ఆర్యపత్రికను ముగించారు.

అంతేగాక నన్ను ఒకరు ఇలా అడిగిరి. మీరు తత్త్వవేత్తనా అని !

అందుకు సమాధానం : యోగి ఏ పని నిర్వహించుటకైనా సిద్ధంగా ఉండాలి అనే సిద్ధాంతం నాది. అందువల్ల తాత్త్విక మాసపత్రిక నిర్వహించితిని. అందులో **1914**లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అందువల్ల పత్రిక భారం మొత్తం నా మీదనే పడింది.ప్రతి మాసం ఒంటరిగా **64** పేజీలు కేవలం తత్త్వజ్ఞానం రాసే భారం నాపై పడింది. తాను అనుభవించిన యోగపాఠాలు దాదాపు అన్ని పత్రికల్లో తెలియజేశారు. అందువల్ల ఆర్యపత్రిక ఎంతకాలం నిలిచి ఉండలేదు.



పాండిచ్చేరిలో 1920వ సంవత్సరములో శ్రీ అరవిందులవారు



ఆర్యపత్రికకోసం పనిచేస్తున్న శ్రీ అరవిందులవారు (1918వ సం॥)

ప్రపంచంలోని ఎన్నో దేశాల వనితామూర్తులు భారతదేశచరిత్ర, గొప్పతనం తెలుసుకొని, కేవలం భారతదేశం పర్యటన కోసం వచ్చి, భారతదేశంలోనే స్థిరపడినారు. అలా వచ్చిన మహనీయులురాలైన శ్రీమాత ఒకరు.

శ్రీమాత జననం, చిన్నతనం ఫ్రాన్స్‌దేశంలోని పారిస్‌లో గడిచింది. **21-02-1878**వ సంవత్సరంలో మీరా అల్ఫాంజో జన్మించింది. శ్రీమాత అసలు పేరు మీరా అల్ఫాంజో. మీరా వంశీయులు ఈజిప్టులోని ఫరావో రాజవంశీకులు. వాళ్ళు ఈజిప్టు వదిలి ఫ్రాన్స్ తరలివచ్చారు.

మీరా తండ్రి పేరు మోరిస్, ఒక వ్యాపారస్తుడు. తల్లి పేరు మాతిల్డా. మీరాకు ఒక అన్న, అతని పేరు మాతివో. తల్లితండ్రుల పేరును కాపాడి ప్రపంచానికే కొత్త వెలుగు తెచ్చినారు అన్నా చెల్లెళ్ళు ఇద్దరు. మాతివో ఆఫ్రికాలో గవర్నర్ పదవిలో ఉంటూ ఎంతో ప్రజాసేవ చేసి ప్రజల గుండెల్లో నిలిచిపోయాడు.

సాధారణంగా యోగి లక్షణాలు ఉన్నా వారు చిన్నతనం నుంచి ఎంతో వైవిధ్యంగా ఉంటారు. అందరిలో ఉంటూనే ఒంటరిగా తమ ఆధ్యాత్మికత పెంపొందించుకుంటారు. ఒంటరిగా ఉంటూ అందరి మంచి చెడులను గమనిస్తూ ఉంటారు. అలాగే మీరా కూడా. మీరాను చిన్నతనం నుంచి అందరూ 'మా' అని పిలిచేవారు. అదే పిలుపు జీవితంలో చిరస్థాయిగా నిలుపుకుంది. యోగి ఎవరైనా

సాధారణ జీవితం గడపటానికి ఇష్టపడతారు. వారికి ఎలాంటి భోగభాగ్యాలు, విలాసవంతమైన సంపదలు, సౌకర్యాలు అవసరం లేవు. వారు ఇష్టపడరు.

పారిస్‌లో ఉన్నా అందమైన,సుఖమైన జీవితానికి ఏనాడు ఇష్టపడలేదు మీరా. మీరా తల్లి మాతిల్డా యొక్క ఆదర్శలక్షణాలు, ఆమె గుణశీలత, సంస్కారం మీరా మీద ఎంతో ప్రభావాన్ని చూపింది.

మీరా చిన్నతనం నుంచి గంభీరంగా ఉంటూ, ఆలోచనలతో యుద్ధం చేసేది. ఆటపాటల్లో కాని, అల్లరి వేషాలు వేయటంలో కాని ఆమె ఏనాడు దృష్టిపెట్టలేదు. ఇంత చిన్నతనంలో అంత గంభీరత్వం, ఏదో పొందాలనే తపన మీరాలో చూసి తల్లికి భయం వేసింది. ఓ రోజు మీరాతో తల్లి, "ఎందుకమ్మా! అంత ఏకాగ్రత, గంభీరత! ఏమైంది?" అని అడిగింది. "అమ్మా!" నాలో నేను విశ్వాన్ని కల్పన చేసుకుంటున్నాను. ఏమి కావాలో ఆ కల్పనే నిర్ణయిస్తుంది" అని తల్లికి స్పష్టంగా చెప్పింది. ఆ మాటల్లోని అంతరార్థం తల్లికి పెద్దగా అర్థంకాకపోయినా మీరా గొప్పవ్యక్తిగా ప్రపంచంలో వెలుగొందుతుందని భావించింది మాతిల్డా.

వ్యాపారంలో నష్టాలు రావడంలో ఆస్తి మొత్తం దాదాపుగా కరిగిపోయి, బీదరికం లోకి అడుగుపెట్టాడు ఆ కుటుంబంవారు. ఉన్న ఐశ్వర్యం పోయేపాటికి మీరాలో ఎలాంటి తేడా లేదు. స్కూల్‌కి నడిచివెళ్ళేది. ఎందరో మీరా పరిస్థితిని చూసి ఎగతాళి చేసేవారు.

వాళ్ళలోని కోపానికి, అసూయ భావాన్ని నేను ఎందకు చెలించాలి అని మీరా ఏనాడు వాళ్ళను పట్టించుకునేది కాదు.

మీరాకు చిన్నతనం నుంచే ఆత్మసాక్షికి వ్యతిరేకంగా నడుచుకోవడం ఇష్టం ఉండేది కాదు. అబద్ధం, అసత్యం, మోసాలను మీరా ఎంత మాత్రం ఇష్టపడదు, అది ఎవరూ చేసినా.

చెల్లి మీద ప్రేమ కారణంగా మాతిల్డా మీరాకు చదువులపై శ్రద్ధ కలుగజేసాడు. మీరా మెల్లమెల్లగా చదువులలో ప్రధమస్థాయికి చేరుకోగలిగింది. మీరాకు చిన్నతనం నుంచి ధైర్యం ఎక్కువ. ఎవరైనా ఆడపిల్లలను ఏడిపిస్తుంటే వారితో మొండిగా దెబ్బలాడేది.

తల్లికి పుస్తకాలంటే ఇష్టం. ఇంట్లో దాదాపుగా1000 పుస్తకాలు ఉండేవి. ఆ పుస్తకాలు దాదాపుగా చదివింది మీరా. పూర్వజన్మ వాసనలు కొందరి జీవితాలను చాలా ప్రభావితం చేస్తాయి. అలా మీరా చదువులలోనే కాక, సంగీతం, నాట్యం, చిత్రలేఖనంలో తన ప్రతిభను ప్రపంచానికి చూపించింది.

మీరాకు చిన్నతనంలోనే ఎన్నో అనుభవాలు ఎదురైనాయి. తన జన్మను ఓ ప్రత్యేకత ఉన్నదని తాను ఓ గృహిణిగా స్థిరపడక, ఏదో ఒక లక్ష్యాన్ని సాధించగలననే నమ్మకం కూడా ఉండేది. 13 ఏళ్ళప్రాయంలో మీరాకు ఓ కల వచ్చింది. తాను శరీరాన్ని, ఇంటిని, నగరాన్ని, అన్నింటిని వదిలి పైపైకి ఎగిరిపోతున్నట్లు, బంగారు మేలి ముసుగు వేసుకొని ఉన్నట్లు, మొత్తం నగరం ఆమె నీడలో ఉన్నట్లు

కలకన్నది. ఆమె ఈ నగర ప్రజల కష్టాలు వింటూ, తన స్పర్శ చేత వారి సమస్యలను తీర్చినట్లు, అలా అందరి దుఃఖం దూరం చేసినట్లు, అలా కల కన్నది. ఆ కల ఆధారంగా ఆమె తన జీవిత గమ్యం, భవిష్యత్తు రెండూ ఊహించినది.

చిన్నప్పుడు మీరా కొన్ని అద్వితీయమైన కార్యాలు చేసింది. చేసిన తర్వాత ఎంతో ఆశ్చర్యపోయాలా తనేనా ఆ పని చేసింది! అని. వాళ్ళ ఇంట్లో ఓ ప్రత్యేకమైన కుర్చీ ఉండేది. ఆ కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉంటే, ఒక తేజస్సు ఆమెలో ఉద్భవించినట్లు అనుభవమయ్యేది ఆమెకు. ఇలా ఎన్నో సార్లు జరిగింది. 7 ఏళ్ళ ప్రాయంలో ఆడపిల్లల్ని ఏడిపించే ఒక భారీ శరీరం ఉన్న ఒక పిల్లవాణ్ని మీరా ఒక రోజు తన చేతుల్తో అవలీలగా ఎత్తి క్రింద పడేసింది. మీరా చాలా సన్నగా బలహీనంగా ఉండేది. తాను ఈ పని చేసానా అని ఆశ్చర్యపోయేది.



వాళ్ళ ఇంట్లో విశాలంగా ఉండే ఓ గది ఉంది. దాని పొడవు 30 అడుగులు. ఒక్క గంతులో మీరా ఒక చివరి నుండి మరో చివరికి వెళ్ళింది. ఇది వరకు 6 - 7 సార్లు ప్రయత్నించినా ఆమె ఎగరలేకపోయింది. ఎవరో తనను పట్టుకుని నడిపిస్తున్నారు అని ఆమె నమ్మకం.

ఇంకోసారి పిల్లలంతా ఆడుకోవటానికి 'ఫాలేనక్' అన్న అడవికి వెళ్లారు. అక్కడ పిల్లలంతా ఆడుకుంటున్నారు. లేడిగా మీరా

పరుగుతీస్తున్నది. ఆమెను పట్టుకోవడానికి మిగితావారు ప్రయత్నిస్తున్నారు. అలా పరుగెత్తుతు చిన్న గుట్టమీద నుంచి లోయలలోకి పడిపోయింది. పిల్లలంతా గాభరాపడి తల్లితండ్రుల వద్దకు వెళ్ళారు.

తల్లితండ్రులు అక్కడ చేరుకునే సరికి మీరా మెల్లగా నడుచుకుంటూ వస్తున్నది. ఎవరో ఒక వ్యక్తి తనను పడిపోకుండా పట్టుకుని ఉన్నాడని ఆమెకు అనుభవం కలిగింది.

ఇలా ఎవరో ఒక అజ్ఞాత వ్యక్తి తన వెన్నంటిఉండి, తన యోగక్షేమాలు చూస్తున్నాడని, త్వరలో ఆ వ్యక్తిని కలుస్తానని ఆమెకు అనిపించింది.

వయుస్సు పెరిగేకొద్ది మీరాలో అంతర మధనం పెరుగసాగింది. ఆధ్యాత్మిక ధ్యాసలో కాలం సాగిపోయింది. 1905లో మీరా "బుద్ధవిచారం" అన్న పేరుతో కొందరు ఆధ్యాత్మిక జ్ఞానవంతులలో ఒక సమావేశం నిర్వహించింది. యవ్వనంలోకి అడుగుపెట్టిన మీరాకు వివాహం తప్ప లేదు. మారిసే అన్న వ్యక్తితో పెళ్ళి జరిగింది. ఒక సంతానం కలిగింది. బిడ్డ (ఆండ్రే)ను తన హృదయంలోని ప్రేమనంతా నింపుతూ పెంచింది. 'కాస్మిక్' అనే ఒక సంస్థను స్థాపించింది. ప్రతి బుధవారం మీరా ఇంట్లో ఆధ్యాత్మిక చర్చలు జరిగేవి. అలా కాలం ముందుకుసాగుతూ ఉన్నది.

1920లో మీరా జీవితంలో కేవలం భగవంతుడు ఉన్నాడు,

ఈ లోకంతో పనిలేదు. మారిసేతో జీవితం విడిపోయి, రిచర్డ్‌పాల్‌ను వివాహం చేసుకుంది. పాల్ కూడా భగవంతుని సేవలో కాలం గడిపే వ్యక్తి. పాల్ పూర్తిగా మీరాకు స్వేచ్ఛను ఇచ్చేవాడు. కుదిరినప్పుడల్లా ఆధ్యాత్మిక చర్చ చేసేవారు.

మీరా జీవితంలో 32 సంవత్సరాలు గడచిపోయాయి. అయితే ఇంకా తను కలుసుకోవలసిన వ్యక్తి, తనను ఆధ్యాత్మికంగా ఉద్ధరించే వ్యక్తి తారసపడతారని ఎదురుచూస్తున్నది. ఆ సమయంలో 1910లో రిచర్డ్‌పాల్ భారతదేశం వచ్చాడు. ఆ రోజుల్లో పాండిచ్చేరి ఫ్రెంచివారి అధీనంలో ఉండేది. పాండిచ్చేరికి ఎంతో విశిష్టత ఉంది. పాండిచ్చేరి అసలు పేరు వేదపురి. అగస్త్యమహాముని తపస్సు గావించిన పవిత్రభూమి. తర్వాతకాలంలో శ్రీ అరవిందుల పాదస్పర్శతో మరోసారి ఈ భూమి తన పవిత్రతను చాటుకుంది. కాని ఈ భూమి మన దేశీయుల చేతుల్లో లేదు.



ఆధ్యాత్మిక శక్తి ద్వారా దేశస్వాధీనత ప్రగతి సాధించాలని, తనకు తానుగా ఈ దేశ స్వాతంత్ర్యం కోసం ఎంతగానో పరితపించిపోయిన మహాయోగి శ్రీ అరవిందులవారు.

రిచర్డ్‌పాల్‌కు కూడా ఆధ్యాత్మిక జిజ్ఞాస ఎక్కువ. అలా తన జీవిత ప్రయాణంలో శ్రీ అరవిందులవారిని కలుసుకున్నాడు రిచర్డ్‌పాల్. పాల్ తన అనుభవాలు, మీరా అనుభవాలను అరవిందులతో పంచుకున్నాడు. అరవిందుల మాటలు మాటలు కావు.

వాటిలో ఎంతో విలువైన జీవితపు సత్యాలు ఉన్నాయి. అనుభవపూర్వక పాఠాలు ఉన్నాయి. పాల్ వాటిన్నంటిని మీరాకు చెప్పి అరవిందుల వారి గూర్చి ఎంతో గొప్పగా వర్ణించి, మీరాకు మొదటిసారిగా అరవిందులవారి గూర్చి తెలియపరచాడు. హృదయవేదనతో దేని కోసం తను పరితపిస్తున్నదో అలాంటిది మీరాకు దొరికింది.

ఇంక తన మనస్సు, ఆలోచనలు, సర్వం శ్రీ అరవిందులవారిపైన ఉన్నాయి. ఎప్పుడు వస్తుందో ఆ మహనీయున్ని చూసే అవకాశం అని మీరా ఎదురుచూస్తూ వేచివుంది. ఆ రోజు **1914** మార్చి **7**వ తేది ఒక ఓడలో మీరా భారతదేశం చేరింది. మీరా వెంట రిచర్డ్‌పాల్ ఉన్నాడు. పాల్ తన స్వప్రయోజనం కోసం భారతదేశం వచ్చాడు. రాజ్యసభ ఎన్నిక కోసం పాండిచేరి నుండి పోటీ చెయ్యాలని పాల్ ఆలోచన, ఆశ.

పాల్, మీరాల ప్రయాణం ఒక్కటయినా, లక్ష్యాలు వేరు. చేరవలసిన గమ్యాలు వేరు.

తను ప్రయాణిస్తున్న ఓడలో క్రైస్తవఫాదరీలు కూడా ప్రయాణం చేస్తున్నారు. ఆ రోజు ఆదివారం ప్రార్థనలయ్యాయి. మీరా ప్రార్థనలో పాల్గొనలేదు. ఆ ఫాదరీలు మీరాను అడిగిరి. అందుకు మీరా సమాధానంగా ఇలా అంది -

"నాకు ప్రార్థనలయందు విశ్వాసం లేదు". అందుకు వారు గర్వంగా మేము మతం మార్పిడి చేయడానికి భారతదేశం

వెళుతున్నాము. భారతీయులకు క్రైస్తవమత గొప్పతనం చాటుతాము అని అనగా, మీరా అంది, "క్రైస్తవ సంప్రదాయం పుట్టడానికి వేలాది సంవత్సరాల ముందే భారతదేశంలో హిందూ సాంప్రదాయంతో ఎన్నో సంప్రదాయాలు పుట్టాయి, ఆచరణలో ఉన్నాయి. వాటిలో లేనిది క్రైస్తవ మతంలో ఏముంది? ఏ మతం యొక్క అభిమతమైనా ఒక్కటే. అది గుర్తుంచండి" అని మీరా వారికి ధైర్యంగా సమాధానం చెప్పింది.

మీరా మాటలకు ఫాదరీలకు భయం వేసింది. ఈ రకంగా మీరాకు భారతదేశం అంటే ఉన్న ప్రేమ మనకు అర్ధం అవుతుంది. భారతదేశానికి ఉన్న ఔనత్యం, సంప్రదాయాలపై మీరాకు ఉన్న జ్ఞానం గొప్పదని మనం గుర్తించాలి.



మీరా, శ్రీ అరవిందులవారిని 1914 మార్చి 29వ తేదీ మొదటిసారిగా కలిసింది. పాండిచేరి చేరినాక సాయంకాలం మూడున్నరకు శ్రీఅరవిందుల వారిని కలిశారు మీరా, పాల్‌లు.

వారి కలయికలో మాటలు లేవు. కేవలం కళ్ళ ద్వారానే వారి సందేశాలు ప్రకటితమవుతున్నాయి. మీరా యొక్క జిజ్ఞాసక్తికి, ఆధ్యాత్మిక మార్గానికి నాయకుడు దొరకటం వల్ల ఇన్నాళ్ళ మనోవేదనకు ఇక స్వస్తి ఈ రోజు పలికింది మీరా.

శ్రీ అరవిందుల వారిని తన గురువుగా ప్రత్యేకమైన దైవంగా భావించింది మీరా. తన జీవితాన్ని అరవిందుల పాదాల చెంత పెట్టి, గురువు ఆజ్ఞ కోసం ఎదురుచూస్తూ ఉండిపోయింది మీరా.

అరవిందుల వారికి కూడా మీరాను చూడగానే మీరా ఒక సాధారణ శిష్యురాలుగా కాక, ఆమెలో దాగున్న ఆధ్యాత్మికమైన శక్తి, అపారమైన కల్పనాభావం, సేవించే తత్వం ఉన్న ఒక అసాధారణ మూర్తిగా కనిపించింది.

మీ నీడలో నా జీవితం ముక్తి పొందుతుంది. మీ చల్లని చూపు, కరుణామయమైన మనసును తెలుసుకుంటే జీవితంలో మరేది అవసరం లేదని అనిపిస్తుంది అని మీరా సంతోషంతో ఉప్పొంగి పోతున్నది.

అరవిందులవారు అంధకారంలోఉన్నవారిని ప్రకాశవంతులుగా చేసిన తీరు అద్భుతం. అలా తాను ఇష్టపడిన వ్యక్తిలో ప్రథమస్థానంలో మీరా ఉంది. అందుకే కాబోలు శ్రీ అరవిందలవారు తమ తపోశక్తి, యోగశక్తి, జ్ఞానాన్ని అన్నింటిని శ్రీమీరాకు ధారపోశారు.

మీరా ఒక కొత్త జీవితం ప్రారంభించింది. ఎందుకంటే తాను ఎదురుచూసిన, ఆశపడిన, కోరుకున్న జీవితం ఇది కాబట్టి.

రాజ్యసభ ఎన్నికలు జరుగలేదు. దాంతో పాల్ కూడా మీరాతో ఆధ్యాత్మికతలో పాలు పంచుకున్నాడు.

1914 జూన్ నెలలో మీరా న్యూ ఇండియా (Meera New India) అన్న పేరుతో ఒక సంస్థను స్థాపించింది. శ్రీ అరవిందులవారు, మీరా, పాల్ ఆసంస్థను నిర్వహించేవారు. ఈ సంస్థలో జాతి, మత, కుల, వర్ణ భేదాలు లేవు. వారు ఒక గ్రంధాలయాన్ని ప్రారంభించారు.

ఇంచుమించు ఇదే సమయంలో 'ఆర్య' మాసపత్రిక నడిపే ప్రయత్నం జరిగింది.

15-08-1914వ సం॥లో శ్రీ అరవిందులవారి జన్మ దిన సందర్భంగా ఆర్య పత్రిక ఆంగ్ల, ఫ్రెంచి భాషలో ప్రారంభమైంది.

మీరా ఆధ్యాత్మిక సాధనలో భూత, భవిష్యత్తు, వర్తమానకాల జ్ఞానం తెలుసుకోగలిగింది. భౌతిక సుఖాలతో మునిగి తేలుతున్న మానవాళిని ఆధ్యాత్మిక శక్తితో, జ్ఞానంతో మేలుకొలపాలని, వారిని దుఃఖం నుండి, కష్టం నుండి బయటకు తెచ్చి ఈశ్వరానుగ్రహం వారిపై ఉండేలా మీరా ప్రయత్నాలు ప్రారంభించింది.

**ఫ్రాన్స్‌కు ప్రయాణం :**



మీరా, పాల్‌కు మరో 2-3 సం॥లు భారతదేశంలో ఉండాలనే కోరిక. కాని 1914లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే ఫ్రెంచి వారితో దేశసేవకై పాల్, మీరాలు ఫ్రాన్స్‌కు వెళ్ళిపోయారు. అయినా మీరా కొద్ది కాలము మాత్రమే ఫ్రాన్స్‌లో ఉంది.

1916వ సం॥లో డిసెంబరు 20వ తేదీ డైరిలో మీరా ఇలా వ్రాసుకుంది -

"నాకు బుద్ధ భగవానుడి దర్శనం కలిగింది. ఆయన నాకు ఓ సందేశం ఇచ్చాడు. "విశ్వంలోని మానవుల పట్ల నీకు ఉన్న సేవాతత్వాన్ని, మాతృత్వపు లక్ష్యాన్ని, ప్రేమను అలాగే కొనసాగించు. ఈ ప్రపంచం నీ యొక్క ప్రేమ పొందటానికి పరితపిస్తున్నది."

ఫ్రాన్స్ నుంచి 1916 మార్చి 13న జపాన్‌కు వెళ్లింది మీరా. జపాన్‌లో మీరా బౌద్ధదర్శనానికి మార్గం చూపింది. దాదాపు 5 సం॥లు మీరా జపాన్‌లో ఉన్నది. జపాన్‌లో ఉన్న ఝైన వర్ణపు ధ్యానపద్ధతిలో ధ్యానంలో ఎంతో ఎత్తుకు వెళ్ళింది మీరా.

జపాన్‌లో మీరా ఆధ్యాత్మిక ప్రవచనాలు చెప్పటం ప్రారంభించింది. ఆమె తన మాటలతో ఎందరినో ఆధ్యాత్మికత పై దృష్టి నిలిపేలా చేసింది. ఎందరో స్త్రీలకు ఆమె ఆదర్శనీయమైంది. ఒకసారి ఒక సభలో మీరా ఇలా మాట్లాడింది, "కేవలం మరో జీవికి జన్మనివ్వటం మాత్రమే మాతృత్వం కాదు. ఆమె శారీరక, మానసిక, భౌతిక ఆధ్యాత్మికస్థాయిలో తన వంతు సేవను, ప్రేమను పంచాలని స్త్రీలందరికి చెప్పింది.

మీరా జపాన్‌లో ఉన్నన్ని రోజులు జపాన్ స్త్రీలు ధరించే కిమానో ధరించేది. ఆమెను అందరూ జపాన్ దేశీయురాలనే అని నమ్మేవారు.

జపాన్‌లో ఉన్నప్పుడు మీరా, అరవిందుల మధ్య ఉత్తరాల ద్వారా ఒకరికొకరు సమాచారం తెలియచేసుకునేవారు. జపానీయులకు పూలంటే ప్రాణం. వారిలోని ఆ గుణం మీరాను ఎంతగానో ఆకర్షించింది, అందుచేత కాబోలు పాండిచేరి ఆశ్రమంలో ఆమె పూలతోట పెరగటానికి పునాది వేసింది.

మీరాకు జపాన్‌లో శ్రీరవీంద్రనాథ్ ఠాకూర్ మహనీయలతో

పరిచయం కల్గింది. ఇద్దరూ కళాకారులే. రవీంద్రనాథ్ ఠాకూర్‌కు మీరాను చూడగానే తన శాంతినికేతన్‌కు కావలసిన మార్గదర్శి, భవిష్యత్తులో శాంతినికేతనను ముందుకు నడిపే సారథి దొరికిందనిపించింది. ఈ ప్రస్తావనను మీరా ముందుంచారు రవీంద్రులు. కాని ఆమె అందుకు ఒప్పుకొనలలేదు.

మీరా ఉన్నది జపాన్‌లో అయినా మనస్సు, ఆలోచనలు అంతా భారతదేశంపై, అందునా పాండిచ్చేరి వైపు 1916లో జపాన్‌లో డూప్లెక్స్ వీధిలో 'ఆర్యన్ స్టోర్సు' ప్రారంభం చేసింది. శ్రీ అరవిందులవారు కూడా పరోక్షంగా అక్కడి ఉన్నారని మీరా భావించింది.



**భారత్‌కు ప్రయాణం :**

మీరా ఇప్పటి నుంచి శ్రీమాతగా పలకటం జరిగింది. అందువల్ల శ్రీమాతగా మీరాను సంబోధించడం జరిగింది.

శ్రీమాత పాండిచ్చేరిలోకి అడుగుపెట్టింది. ఉండటానికి నివాసస్థలం లేదు. ఒక పాడుపడిన భవనం దొరికింది. ఆ ఇంట్లో సౌకర్యాలు కూడా సరిగ్గాలేవు. అయినా శ్రీ మాత పరిస్థితులకు అనుగుణంగా నడుచుకుంది.

ఆ రోజు సాయంకాలం శ్రీ అరవిందుల దర్శనానికి శ్రీమాత, రిచర్డ్‌పాల్‌లు వెళ్ళారు. పాండిచ్చేరిలో ప్రతి శనివారం సాయంకాలం అరవిందులు తన అనుచరులు, శిష్యులు, తోటి

సాధకులతో గడపటానికి వాళ్ళ ఇళ్ళకు వెళ్ళేవారు. అందరికి భోజనాలు అక్కడ ఏర్పాటు జరిగేవి. భోజనాలు అయ్యాక మీరా, అరవిందుల వారి సమావేశం జరిగింది. మౌనంగా ఎదురుగా ఉన్న సముద్రపు అలలను చూస్తూ, ప్రశాంతమైన వాతావరణంలో వారి మనోభావాలు పంచుకున్నారు.

ఇద్దరు యోగుల మధ్య (వారు ఒకే స్థాయిలో ఉన్నప్పుడు) ఎలాంటి శబ్ద పదజాలాలు అక్కరలేదు. వారి స్థితి, స్థాయిల బట్టి కేవలం మౌనంతో వారు సంభాషించగలరు. సాధారణ మానవులకు అవి ఎప్పటికి తెలియవు. అర్థం కావు. శ్రీమాత లాగా రిచ్చర్డ్ శ్రీ అరవిందుల వారికి పూర్తిగా అంకితమవ్వలేదు. అందుకే కాబోలు రిచ్చర్డ్ ఎక్కువ రోజులు పాండిచ్చేరిలో ఉండలేదు.

1920లో శ్రీమాతకు ఒక కల వచ్చింది. దాని సారాంశం - "శ్రీ అరవిందులు, మీరా, రిచ్చర్డ్‌లు కలిసి ఎక్కడికో వెళ్తున్నారు. పోతుండగా రిచ్చర్డ్ ఒక లోయలో పడిపోయాడు. ఎవరో వచ్చి అతడ్ని లేపి లోయపైభాగాన పెట్టాడు. అయినా రిచ్చర్డ్ ఆ లోయలో పడిపోయాడు. అప్పుడు శ్రీ అరవిందులవారు ఇలా అన్నారు - మాయాశక్తి, అధ్యాత్మికయందు సంపూర్ణ విశ్వాసం లేనివారు ఈ పాండిచ్చేరిలో ఎక్కువ రోజులు ఉండలే"రని. శ్రీ అరవిందుల వారు చెప్పిన ప్రకారం రిచ్చర్డ్ ఎక్కువ రోజులు పాండిచ్చేరిలో ఉండలేకపోయాడు.

శ్రీమాతను అరవిందుని సన్నిధానంలో వదిలి తాను తన దేశం వెళ్ళిపోయాడు రిచ్చర్డ్. తర్వాత కాలంలో రిచ్చర్డ్ 'ది లార్డ్ ఆఫ్ నేషన్స్' అనే పుస్తక రచన చేశాడు.

శ్రీమాత మెల్లమెల్లగా శ్రీ అరవిందుల వారి నుంచి ఆధ్యాత్మిక శక్తి పొందినది. అంతేగాక పాండిచ్చేరిలో సేవా కార్యక్రమాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు, ఒకటిఏమిటి ఎన్నో రకాల సేవలకు, కార్యక్రమాలకు నాంది పలికింది శ్రీమాత. అందుకు శ్రీ అరవిందుల సహాయ సహకారాలు శ్రీమాతకు ఎప్పుడూ ఉండేవి.

1924వ సం॥లో నవంబరులో పెద్ద తుఫాను వచ్చింది. ఆ తుఫాను భీభత్సానికి పాత ఇళ్ళు కూలిపోయాయి. శ్రీమాత ఉంటున్న ఇల్లు వర్షపునీటితో నిండిపోయింది. శ్రీ అరవిందులవారి ఆశ్రమంలోకి వచ్చారు శ్రీమాత. అటుపై కాలంలో పాత ఇల్లు ఖాళీచేసి శ్రీ అరవిందుల వారి వెంట ఉన్నారు శ్రీమాత.



ఆశ్రమం అప్పుడప్పుడే మెల్లగా సౌకర్యాలతో ఒక్క రూపంలో వస్తున్నది. శ్రీ అరవిందులవారు ఎప్పుడూ సాధనలో నిమగ్నులై ఉండేవారు. శ్రీ అరవిందులవారు సాధనలో లేని సమయంలో ఆశ్రమం గురించి పట్టించుకునేవారు. కాని శ్రీమాత రాకతో శ్రీ అరవిందులవారు ఆశ్రమపు భాద్యతను శ్రీమాతకు అప్పజెప్పి, తాను సాధనలో ఉండిపోయారు. శ్రీమాత ఆశ్రమపు పరిస్థితి, స్థితిగతులు తెలుసుకొని దాన్ని సరియైన దారిలో పెట్టడానికి కంకణం కట్టుకున్నది.

మొదట అక్కడి వున్నవారిలో ఐక్యతాభావం ఏర్పర్చి, నియమాలతో ఆ ఆశ్రమాన్ని ముందుకు నడిపింది.

గుట్టలు, గుట్టలుగా ఉన్న పుస్తకాలను సరియైన పద్ధతిలో పెట్టి, వాటికి ఒక కొత్తరూపం తెచ్చింది. పూలమొక్కలను తెచ్చి పెట్టింది. అక్కడ వాతావరణానికి ఆహ్లాదాన్ని తీసుకువచ్చింది శ్రీ మాత. తినటానికి, నివసించడానికి అనువైన సౌకర్యాలు మెరుగుపరచింది. అక్కడి వారందరి మనసులను గెలిచి, మాతృత్వపు ప్రేమను సమానంగా అందరికి పంచింది. సదా శ్రీమాతగా పిలువబడి, కొలవబడుతూఉంది.

తుఫాన్ కారణంగా ఆశ్రమంలోకి అడుగుపెట్టెలా చేసింది శ్రీ అరవిందుల కల్పనాశక్తి అని మనం తెలుసుకోవాలి. శ్రీమాత రాకతో ఆశ్రమం కొత్త చిగురు వేసింది. ఎవరైనా శ్రీ అరవిందులవారి వద్దకు వస్తే, వారికి వసతిసౌకర్యాలు ఏర్పాటుచేసేది శ్రీమాత. ఇలా ఎన్నో రకాల భాద్యతలను, బరువులను తను ఎంతో ఓర్పుతో, నేర్పుతో సమర్థవంతంగా నిర్వహించింది శ్రీమాత.

అందరిలో శ్రీఅరవిందుల వారిపై గురుభావం కలిగేలా శ్రీమాత అక్కడవారికి బోధించింది. శ్రీ అరవిందులవారిలో నిగూఢంగా దాగివున్న ఆధ్యాత్మికశక్తిని తెలుసుకోమని తెలిపింది. శ్రీఅరవిందులవారు మీరాను మీరా అని పిలువకుండా 'మా' మాతగా సంభోదించేవారు. అందువల్ల ఆశ్రమవాసులు కూడా మీరాను

శ్రీమాతగా సంబోధించినారు.

1926వ సం॥లో నవంబరు 24వ తేదీన శ్రీ అరవిందుల వారు తన సాధననుంచి బయటకు వచ్చి శిష్యులకు, ఆశ్రమ వాసులకు, అనుచరులకు దర్శనభాగ్యం కలుగజేసారు. వారికి సరికొత్త అనుభూతిని కలుగజేసారు. అందరికి ఈశ్వరానుగ్రహం కలిగేలాగా తన శక్తి వారితో పంచుకున్నారు. ఎవరెవరి యోగ్యతను బట్టి వారికి అవి సిద్ధింపచేయటం జరిగింది. ఆ తర్వాత శ్రీ అరవిందులవారు మళ్ళీ సాధనకు వెళ్ళిపోయారు. శ్రీమాత యొక్క నీడలో అందరూ సేదతీర్చుకున్నారు.

**శ్రీమాతను గూర్చి అరవిందులవారు ఇలా అంటారు -**



"శ్రీమాత రాకవల్ల నా ధ్యానశక్తి పెరిగింది. ఎందుకంటే నా బాధ్యతలను ఆమె స్వీకరించి, నాకు సాధన చేసుకోవడానికి సమయం దొరికెలా చేసింది. అంతేగాక ఆమెలో దాగివున్న సేవాభావం, ప్రేమ, జిజ్ఞాస నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయి. నా కల్పనాజీవితంలో నేను పొందిన అనుభవాలను, ఈశ్వరానుగ్రహానికి నాకు శ్రీమాత సహాయం ఎంతో ఉపయోగపడింది."

ఆశ్రమవాసులు, శిష్యులు, అనుచరులు, శ్రీఅరవిందుల వారిని గురువుగా భావించారు. కాని శ్రీమాతను ఒక బాధ్యతరాలు గానే గుర్తించారు. అంతేగాని గురువుగా భావించలేదు. ఆ సమయంలో శ్రీఅరవిందులవారు శ్రీమాతపై వారికి గురుభక్తి కలిగేలా

చేశారు. శ్రీమాతలోని గుణాలు, లక్షణాలను వారికి స్పష్టంగా తెలిపి వారందరిలో దాగివున్న అజ్ఞానపు తెరలను తొలగించారు.

శ్రీమాత యొక్క నిస్వార్థసేవకు ఆశ్రమంలో ఉండటానికి వచ్చే వారి సంఖ్య పెరిగింది. **1926**లో ఆశ్రమం కోసం మరో రెండు ఇళ్ళు అద్దె కొరకు తీసుకున్నది. ఆశ్రమంలో డబ్బుకు సంబంధించి ఎలాంటి వాదనగాని, అసలు డబ్బు ప్రసక్తి ఉండేది కాదు. అలా అని సన్యాసాశ్రమం కాదు. ఈ ఆశ్రమంలో ఎవరైనా ఉండవచ్చు కాని వారికి కుల, మత, వర్ణ, ధన, బీద, ఎలాంటి భేదభావాలు ఉండకూడదు.

శ్రీమాతను గూర్చి ఒక సాధకునికి ఒక లేఖలో శ్రీఅరవిందులవారు ఇలా రాశారు.

"నాలుగు మహాశక్తులు శ్రీమాత ద్వారా కార్యనిర్వహణ చేస్తున్నాయి. అవి మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, మహేశ్వరి శక్తులని, మానవజాతిని అజ్ఞానం నుంచి జ్ఞానం వైపుకు తీసుకువెళ్తారు. జీవితపు సర్వం గూర్చి తెలుపుతాయి" అని లేఖ వ్రాశారు.

**1928-29**వ సం॥ కాలంలో ఆశ్రమంలో వారానికోసారి సాధకుల, శిష్యుల, అనుచరుల ప్రశ్నలకు, అనుమానాలకు శ్రీమాత, సమాధానలు చెప్తుండేది. అలా ఎందరికో తన ప్రవచనాలతో, మాటలతో మార్గదర్శకం చేస్తూ, సత్యమార్గాలలో ప్రయాణించేలా చేసింది.

1932వ సం॥లో నవంబరు 18 నుండి శ్రీమాతకు జబ్బు చేసింది. ఆ జబ్బు 45 రోజులు ఉన్నది. అటుపై కాలంలో ఆమె నిర్వహిస్తున్న బాద్యతలను, మెల్లమెల్లగా తగ్గించుకుంటూ తన శిష్యులకు ఆ బాధ్యతలను అప్పచెప్పింది. అందరూ పొద్దున 9 గంటలకు కలిసి ఒక అరగంట సాధన చేసేవారు.

ఆశ్రమంలో వచ్చిన అతిథులకు ఆమె స్వయంగా సేవ చేసేది. ఇలా పాండిచ్చేరిలోని అరవిందో ఆశ్రమానికి అంతర్జాతీయ గుర్తింపు వచ్చింది.

శ్రీ అరవిందులవారు దీక్ష, సాధనలలో ఉన్నవారు కాబట్టి శ్రీమాతే అన్ని బాధ్యతలను తీసుకొని అందరి యోగక్షేమాలు పట్టించుకునేది. శ్రీ అరవిందుల వారు సంవత్సరములో కొన్ని రోజులు మాత్రమే తన శిష్యులకు దర్శనభాగ్యం కలుగచేసేవారు.



ప్రతి సంవత్సరం ఆగష్టు 15న శ్రీ అరవిందుల వారి జన్మదినం, ఫిబ్రవరి 21, శ్రీమాత జన్మదినం, నవంబర్ 24వ తేదీ దివ్యశక్తి అవతరణరోజు, ఏప్రియల్ 24వ తేదీ శ్రీమాత పాండిచ్చేరికి వచ్చిన రోజు - ఈ నాలుగు రోజులలో శ్రీమాత శ్రీ అరవిందులవారు అందరికి దర్శనభాగ్యం కలుగచేసి, వారిలో ఉన్న అజ్ఞానాన్ని తొలగించేవారు.

1938లో రెండవ ప్రపంచ యుద్ధం మొదలైంది. నాజీల దౌర్భాగ్యపు ఆలోచనలకు రూపమే ఈ ప్రపంచ యుద్ధం. వారి తీరుకు

ప్రపంచం మొత్తం భయకంపితమైంది. 1938వ సం॥లో నవంబరు 23వ తేదీ శ్రీ అరవిందుని కాలిమీద ఓ దెబ్బ కనిపించింది. అది దుష్టశక్తి ప్రభావం అని అరవిందులవారు గుర్తించారు. ఈ యుద్ధంలో తాను (ఆశ్రమవాసులు అందరు) ఇంగ్లాండ్‌కు మద్దతు ప్రకటించారు.

అసలయితే ఇంగ్లాండ్ మన దేశానికి దాస్యశృంఖలాలను తొడిగి బానిసగా మార్చివేసి శత్రువైంది. అటువంటివారికి మన మద్దతు సహాయసహకారాలు ప్రకటించటమేమని అందరు విస్మయ మొందారు. అందులకు శ్రీమాత ఇలా అన్నారు.

"మన పొరుగువాడి ఇల్లు కూలిపోతుంది. ఆ ఇంటివాడు మనకు అన్యాయం చేసివున్నాడు. కాని ఆ ఇంటిని తగులబడనిస్తే ఆ నిప్పు అంతటితో ఆగుతుందా? మన కొంపకు అంటుకోకుండా ఉంటుందా? అలాగే నాజీల యుద్ధం ఇంగ్లాండ్‌మీద కూడా అంతే. భారతదేశం మీద కూడా ఆ ప్రభావం వుంటుంది" అని శ్రీమాత అభిప్రాయపడింది.

యుద్ధకాలంలో ఆశ్రమవాసుల సంఖ్య రోజురోజుకు పెరిగిపోయింది. వచ్చిన వాళ్ళలో చిన్న వయస్సు, యవ్వన్నంలో ఉన్నవారే ఎక్కువ. ఆధ్యాత్మికజీవనం కోసం శరణుజొచ్చినవారే ఎక్కువ. శ్రీమాత అరవిందులకు కావలసిన నివాసవసతులు, భోజనసదుపాయాలు, విద్యాలయాలు, వైద్య అవసరాలు అన్ని సమయానుకూలంగా ఏర్పాటుచేసేది. కేవలం చదువులే కాక

ఆటపాటలపై కూడా శ్రద్ధ చూపించింది. అందుకు శ్రీ అరవిందులవారు శ్రీమాత ఎప్పుడు సమ్మతమే చెప్పేవారు.

ఆశ్రమవాసులకు బయటి ప్రపంచం యొక్క సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలియచేస్తూ వారిలో ప్రపంచజ్ఞానాన్ని కూడా పెంపొందించింది.

శ్రీమాత ఆశ్రమానికి దగ్గర్లో ఒక అతిథి గృహాన్ని నిర్మించింది. శ్రీ అరవిందుల ఆశ్రమ ప్రచురణలకు ఒక ముద్రణాలయాన్ని ప్రారంభించింది. శ్రీమాత తన బాధ్యతలను ఆశ్రమవాసులతో పంచుకునేది అయినా ప్రతిదానిపై శ్రద్ధ, పట్టు ఉండేది.



మనసులో ఎలాంటి కల్మషం లేక, అందరూ తనవారని శ్రీమాత అందరికి తన ప్రేమను పంచింది. తాను ఈ పవిత్ర భారతదేశంలో పుట్టిందని భావించింది.

శ్రీమాత ఆహారం కొద్దిగానే తీసుకునేది. అంతేకాక అందరితో ఇలా అనేది. నాకు శక్తి ఆహారం వల్ల లభిస్తుందని మీరు అనుకుంటే మీ పొరబాటు అది. ఎంత శక్తి కావాలో, అంత ఆ ఈశ్వరానుగ్రహరూపంలో నా శరీరానికి, మనసులోకి ఎప్పటికప్పుడు వస్తూనే వుంది.

ఆశ్రమంలో ఎలాంటి అవాంఛిత ఘటనలు, చర్చలు చేయటానికి వీలులేదు. ధూమపానం, మద్యం, రాజనీతి లాంటి

వాటికి స్థానం లేదు. కేవలం ఆశ్రమ జీవనమే గడపాలి. సమాజానికి ఆదర్శప్రాయంగా నిలవటమే అరవిందుల ఆశ్రమపు లక్ష్యం.

శ్రీమాతలో సేవాభావం, బాధ్యతలు నిర్వహించడమే గాక తనలో చిన్నతనం నుంచి ఉన్న కళాకారిణిని బయటపెట్టింది. 1949 డిసెంబర్ 1న 'భవిష్యత్తు వైపు' అన్న నాటకాన్ని ఆశ్రమవాసులచే ప్రదర్శింపచేసింది. పిల్లలకు తను చెప్పే కథలు 'టేల్స్ ఆఫ్ ఆల్ టైమ్స్' అని పుస్తకరూపంలో తెచ్చింది. ఆమెకున్న దైవచింతనల సారాంశమే 'ప్రార్థన-ధ్యానం' అన్న పుస్తకం. అంతేకాక శ్రీమాత సాధకులకు, శిష్యులకు చెప్పిన ప్రవచనాలు, మాటలు, జ్ఞానబోధలు, వ్రాసిన లేఖలు అన్ని ఈ రోజు పుస్తకరూపంలో మనముందు ఉన్నాయి. అవి భావితరాల వారికి శ్రీమాత అందిస్తున్న గొప్ప బహుమతి. ఈ పుస్తకము చదివితే శ్రీమాతయొక్క ఆలోచనలు, మనసు మనకు అర్థం అవుతాయి.

అఖండ భారత్ :

ఎంతోమంది మనుష్యులున్నారు. అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే అయినట్లు భారతదేశం కూడా ఒక్కటే. ముక్కలుగా విభజించే అర్హత ఎవరికి లేదని చాటిన మానవమూర్తి శ్రీమాత. 1947 జూన్ 6వ తేదీన భారతదేశాన్ని పాలిస్తున్న బ్రిటిష్ అధికారి భారతదేశ విభజన ప్రకటించటానే దానికి స్పందించి, భారతమాత వాణిని వినిపించింది ఓ విదేశీవనిత. శ్రీమాత నిరంతరం అఖండ భారతదేశం

గూర్చి మాట్లాడేది. స్వతంత్ర భారతదేశం ప్రభుత్వ వత్తిళ్ళకు లొంగక ఆపటాన్ని శ్రీమాత అక్కడ నిలిపే వుంచింది. ఏనాటికైనా తిరిగి అఖండ భారతం సాధిస్తాం అని మంచి నమ్మకం కల్గి ఉన్నది శ్రీమాత.

ఏ మానవుడు ఒంటరి కాదని, ఆ పరమాత్ముని తోడుగా నీ వెంట సదా ఉంటాడని నమ్మకంగా ఉండమని చెప్పింది శ్రీమాత. అంతేకాక భవిష్యత్తు మీద విశ్వాసం, భవిష్యత్తులో లభించబోయే వాటి విషయంలో సమృద్ధభావన కలిగిన వాళ్ళే ఆదర్శవంతులు అని యువకులకు చాటింది శ్రీమాత.



1947 ఆగస్ట్ 15వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. కాని అది ఖండిత దేశంగా ఉండిపోయింది. విభజన ఆనందం కంటే వేదనే ఎక్కువగా తీసుకువచ్చింది. అంతేకాక శ్రీమాత ఇంకా అఖండ భారత్ గూర్చి ఇలా అన్నారు.

"హిందుస్థాన్ స్వాధీనత ప్రశ్న అలాగే ఉండిపోయింది. సంపూర్ణం కాలేదు. తిరిగి అఖండ భారత్ ఏర్పడేదాకా మన ప్రతీక్ష తప్పదు. అప్పటివరకు మన నినాదం ఒక్కటే, హిందూ చైతన్యం అమరం."

స్వాతంత్ర్య దిన శుభవేళ శ్రీఅరవిందులవారు, శ్రీమాత ఆశ్రమంలో భారతపతాకాన్ని ఎగురవేశారు. ధ్వజం మీద సింహళం, బ్రహ్మదేశంలతో సహా ఉన్న అఖండ భారతపటం ఉంది.

మధ్యభాగంలో శ్రీమాత చిహ్నం శోభాయమానంగా ఉంది.

అఖండ భారత్ అన్నది శ్రీమాత స్వప్నం. వ్యక్తి వ్యక్తిలో ఆ స్మరణ నిత్యం ఉండేలా శ్రీమాత ఆటల మైదానంలో అఖండ భారతచిత్రపటాన్ని పెట్టింది. ఆశ్రమానికి వచ్చే పరిచిత, అపరిచిత వ్యక్తులందరి మనస్సుల్లో ధృఢంగా నిలవాలని ఆమె ఇచ్ఛ. ఇప్పటికి కూడా ప్రతి సాయంత్రం జరిగే గణసమతలో ఈ చిత్రపటానికే ప్రతివారు ప్రణామం చేస్తున్నారు. ఆ పటం ముందు కూర్చుని ధ్యానం చేస్తారు.

ఈ విషయంలో **1956**లో ప్రభుత్వం తీవ్ర అభ్యంతరాలు చెప్పి తొలగించటానికి ఆజ్ఞ ఇచ్చారు. ఆ తర్వాత కూడా అనేక ఒతిళ్ళు వచ్చాయి. అయినా శ్రీమాత స్థిరంగానే ఉంది. అందువల్ల అఖండ భారత్‌చిత్రపటం ఇంకా ఆశ్రమంలో నిల్చి ఉంది.

శ్రీ అరవిందులు, శ్రీమాత ఉన్న ఆశ్రమానికి అనేక చోట్లనుంచి ఎందరెందరో వచ్చేవారు. మహాసంస్కృత పండితులు శ్రీ టి.వి.కపిలశాస్త్రి శ్రీమాత వల్ల ప్రభావితులై 'మాతృ ఉపనిషత్తు' అన్న గ్రంథాన్ని రచించారు.

ఎందరో పెద్దలు, పండితులు, విద్యావేత్తలు, జ్ఞానవంతులు, కళాకారులు, శ్రీమాత సన్నిధికి వచ్చి ప్రభావితులయ్యారు.

శ్రీమాత **1952** జనవరి**6**వ తేదీన అంతర్జాతీయ విద్యాకేంద్ర

ప్రయోగం ప్రారంభించారు. ఎన్నో దేశాల నుండి ఎందరో ఈ విద్యాకేంద్రంలో చేరటానికి ఉత్సాహంగా వచ్చారు. అందరిలో శారీరక, మానసిక, భౌతిక, ఆధ్యాత్మిక అంశాల్లో పరివర్తనకు అనుకూల అభ్యాసం ఈ కేంద్రం యొక్క ఉద్దేశ్యం. ఈ యొక్క ఉద్దేశాలకు ఇమిడలేక కొంతమంది తిరిగి వెళ్ళిపోయినవాళ్ళు ఉన్నారు. అప్పుడు శ్రీమాత నవ్వుతూ ఇలా చెప్పేది, "ఇతరుల్ని మార్చగలిగిన శక్తి మీలో ఉన్నప్పుడు మాత్రమే ఇతరుల మీద ఫిర్యాదులు చెయ్యాలి."

శ్రీమాత ఎన్నో ఒడుదుడుకులతో ఎక్కడి నుండి ఇక్కడికి వచ్చి ఏ స్థాయిలో ఉన్నదో ఈశ్వరానుగ్రహం శ్రీమాత మీద ఎలా ప్రసరిస్తున్నదో చదువరులు అర్థం చేసుకోగలరు.



1957వ సం॥ నాటికి శ్రీమాత 80 సం॥లోకి ప్రవేశించింది. శరీరం ఎంతో బాధిస్తున్నా ప్రతిరోజు సాధన చేసేది ఆశ్రమవాసులకు తగిన మేరకు సలహాలు, సూచనలు ఇచ్చేది. ప్రవచనాలు చెప్తూ ఉండేది.

1958వ సం॥ గుండెపోటు వచ్చింది. శ్రీమాత మంచం మీదనే దాదాపుగా రోజుంతా ఉండాల్సి వచ్చేది. వసుధ అన్న శిష్యురాలు శ్రీమాతాకు దగ్గర ఉండి మాత యొక్క అవసరాలు తీర్చేది.

85వ సం॥ అంటే 1962లో శ్రీమాతకి రెండోసారి గుండెపోటు వచ్చింది. శ్రీమాత మామూలు మనిషి కావటానికి ఎంతో

సమయం పట్టింది. అయినా రోజు వారి కార్యక్రమాల్లో ఎలాంటి మార్పు ఉండేది కాదు.

1960లో 'వరల్డ్ యూనియన్-శ్రీమాత సొసైటీ'లను శ్రీమాత స్థాపించింది.

వరల్డ్ యూనియన్ యొక్క ప్రధాన ఉద్దేశం విద్వజ్జనుల సమ్మేళనాలు నిర్వహించటం, విచార విమర్శనల్ని ప్రోత్సహించటం.

శ్రీ అరవింద సొసైటీ ఆయన ఆలోచనల్ని, ప్రబోధాల్ని ప్రచారం చెయ్యటం బాధ్యతగా ఏర్పడింది. శరీరం కృంగిపోయినా సేవ చేయాలనే మనస్సు ఆజ్ఞను పాటిస్తూ కొత్త కొత్త కార్యక్రమాలకు నాంది పలికింది శ్రీమాత.



1972వ సం॥లో శ్రీ అరవిందుల జన్మశతాబ్ది సంవత్సరం. ఈ సంవత్సరం ఎందరో అతిథిలు వస్తూపోతున్నారు. ఎన్నో పుస్తక ఆవిష్కరణలు, వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు, శిక్షణలు, ఇలా ఎన్నో ఆ సంవత్సరం ఆశ్రమంలో జరిగినవి. శ్రీమాత వయస్సు 94 సం॥లు. ఆమె శరీరం ఎంతో కృంగిపోయి ఉంది. అయినా మనస్సు యవ్వనంలాగానే ఎంతో చలాకిగా ఉండేది. 21-02-1973లో సాధకులకు తన దర్శనం భాగ్యం కలుగచేసింది. తినటానికి ఏ మాత్రం ఇష్టపడలేదు. ఆగస్టు 15, 1972న మేడపై భాగం నుంచి

దాదాపు **8000**ల మంది సాధకులకు ఆమె తన దర్శన భాగ్యం కలుగచేసింది. ఎక్కువ సేపు మంచం మీదనే ఉండేది.

**17-11-1973**వ నాడు సాయంకాలం గం॥ **7.25** ని॥లకు ఆమె జీవనజ్యోతి ఆ పరమేశ్వరుని సన్నిధికి చేరింది. శ్రీమాత పార్థివశరీరాన్ని ఆశ్రమంలోని ధ్యానస్థలి దగ్గర ఉంచారు. ఎందరో విదేశీయులు, స్వదేశీయులు ఆమెను చూడటానికి తరలివచ్చారు. సేవా వృక్షం క్రింద శ్రీఅరవిందుల వారి సమాధికి సమీపంలో శ్రీమాతను మహాసమాధి చేశారు.



ఎక్కడో పుట్టి, మీర నామధేయంతో మొదలుపెట్టిన జీవిత ప్రయాణం చివరగా ఎందరో హృదయాల్లో జ్యోతిరూపంలో శ్రీమాతగా తన మాతృత్వపు ప్రేమ పంచుతూ హాయిగా సేవాలక్ష్యం నీడలో కొలువై ఉండిపోయింది.

*ఓ మాత నీ సేవ మేము, మా దేశం మరువం*
*దేశాభివృద్ధిలో నీ పాత్ర నిత్య స్మరణం*
*అజ్ఞానవంతులైన మాకు నీ జీవితం ఆదర్శం*
*ఏమి ఇచ్చి తీర్చుకోవాలి నీ ఋణం*
*నీవు సదా మా జీవితాల్లో నిలిచే జ్ఞాపకం*

మోకరిల్లి నీ పాదాలకు నమస్కరిస్తున్నాం
మేము మీ పాదధూళిలో పరవశించి పోయెదం
నీకు ఇవే మేము యిచ్చే గొప్ప గౌరవం.











శ్రీ మాత శ్రీ అరవిందుల వారితో

అందరికి (కుల,మత, వర్గ, పేద, ధనిక, విభేదాలు లేని) ఎళ్ళవేళల ఆహ్వానం ఇచ్చే వేదిక.

ఆశ్రమం అంటే ఏమిటి? దాని ముఖ్య ఉద్దేశాలు ఏమిటి? అరవిందులవారు ఆశ్రమ స్థాపన, అందు జరుగు కార్యక్రమాల గూర్చి ఒక వ్యాసం 1934సం।। వ్రాశారు. అందులో తెలుపబడిన విషయములు క్లుప్తంగా ఆశ్రమము అనగా ఆధ్యాత్మికతత్త్వోపదేశకుని లేక ఆచార్య పురుషుని గృహం. అందులో తత్త్వోపదేశమునకు దాన్ని అభ్యసించుటకు వచ్చినవారు ఉండే స్థలం.

ఆశ్రమం ఒక సమాజం కాదు, మత సంస్థకాదు, మఠము కూడా కాదు. ఆశ్రమం సర్వస్వము గురువుగారిదే. అందులో ఉండు సాధకులకు, ఏవిధమైన హక్కుగాని, స్వాతంత్ర్యముగాని ఉండవు. వారు ఆశ్రమంలో ఉండుట, వెళ్ళిపోవుట అంతా గురువు ఆధీనంలో ఉంటుంది.

అరవిందులవారు పాండిచ్చేరి(పుదుచ్చేరి)కి వచ్చిన కొత్తలో కొద్దిమంది సహచరులతో తనయింట నివసించుచుండిరి. తర్వాత కాలంలో వారిని మరికొంతమంది ఆశ్రయించిరి. 1920వ సం।।న శ్రీ తల్లిగారు అరవిందులవారితో

కలసిన తర్వాత శిష్యుల సంఖ్య పెరిగింది. వచ్చినవారికి నివాసము ఏర్పాటు చేయవలసివచ్చినది. అందుకొరకు కొన్ని గృహములు అద్దెకు తీసుకున్నారు. అందులో వచ్చినవారికి సౌకర్యాలు ఏర్పాటుచేశారు. అందులో వారికి కావలసిన వసతులు, భోజనాలకు సంబందించిన పద్దతులు చూడటం అన్ని శ్రీ తల్లిగారు చూసేవారు.

ఆశ్రమ గృహాలన్నింటికి శ్రీ అరవిందులవారు, శ్రీతల్లిగారు వారికి మాత్రమే హక్కు కలదు. అందుకు ఖర్చు అంతా అరవిందులవారు కాని, శ్రీతల్లిగారు కాని ఇచ్చేవారు. అరవిందులవారికి సాయపడునట్లు కొంతమంది వారికి డబ్బులు ఇచ్చేవారు. ఆగృహంలో ఉండువారు కొంతమంది కూడా డబ్బులు ఇచ్చేవారు.



ఆశ్రమం సమాజం కాదూ, అందులో ఏనియమములు లేవు, ఏ అధికారులు లేరు, ఏ ఉద్యోగులు లేరు, ఆశ్రమానికి సంబందించిన ఆస్తి ఏమిలేదు. ప్రజలకు సంబంధించిన ఏకార్యక్రమములు అక్కడ జరుగవు. ఆశ్రమంలో ఉన్నవారిలో విద్యావంతులు, మేధావులు, అసాధారణ ప్రతిభగల కవులు, గాయకులు, చిత్రలేఖకులు, కళానిపుణులు, యోగులు కొందరు ఉన్నారు. అరవిందులవారికి యోగమందు పట్టు ఉండటం వల్ల

అందరు తమ గురువుగా శ్రీ అరవిందులవారిని గౌరవించేవారు. శ్రీ అరవిందులవారు చెప్పిన ధ్యానమందు సాధనకి ఎక్కువ కాలం గడిపేవారు. శిష్యులలో ఎక్కువ తక్కువలు ఎవ్వరికి లేవు అందరు సమానులే. ఆహ్వానితులు అంతగా ఆశ్రమంలో లేకున్న, బ్రహ్మచర్యమందు పట్టింపు ఎక్కువగా ఉండేవి. స్త్రీలకు ప్రత్యేక గృహాలు ఉండేవి.

ఆశ్రమ ఆహార విషయాలు - అన్నింటి మీద వ్యామోహం పోయి యోగం కొరకు ఆశ్రమమున శరణుజొచ్చిన వారికి ఆహారమందు పెద్దగా శ్రద్ధ ఉండేది కాదు. అయిన ఆశ్రమములో వండిన ఆహారం ఎంతో ఆరోగ్యకరంగా ఉండేది. యోగసాధనకు కేవలం సాత్త్వికాహారము ఉండాలి అన్న నియమం లేదు. భిన్న భిన్న రుచులు కలసి వండినవి అందరూ సమిష్టిగా తినేవారు, మాంసాహారం ఎన్నడూ వండలేదు. ఉల్లిపాయలు, ఇంగువ, ఆవాలు, ఇలాంటి ఘాటు పదార్థాలు కూడా వాడేవారు కాదు. పాలు, పెరుగు, రొట్టి, జొన్నలు, పప్పులు కూరగాయు ఇవే ఎక్కువగా వండేవారు.

ఆహార పదార్థాలు తయారుచేయుటం, వాటిని శుభ్రపరచటం. బట్టలు ఉతకటం అన్నీ ఆశ్రమ సాధకులే చేసేవారు. ఆశ్రమంలో ఉన్న ప్రశాంతతకూ ఎవరూ

భంగపరిచేవారుకాదు. శాంతిచే ఆశ్రమం వెల్లివిరిసేది. ఎలాంటి అలజడులు, హడావిడి, అట్టహాసాలు అక్కడ కనిపించేవి కాదు. ఆశ్రమ గృహాల ప్రత్యేకత వాని శుభ్రతయే, ఆశుభ్రతను బట్టి ఆవి అరవిందులవారి ఆశ్రమం అని బయటివారు గుర్తించేవారు. ప్రతి గృహమందు చూడచక్కని అనేక రకాల పూల మొక్కలు చూపరులకు ఎంతో ఆకర్షించేవిధంగా ఉండేవి. ఆశ్రమ విద్యాలయం - కొన్ని సం॥ క్రితం 12సం॥ తక్కువ వయస్సు ఉన్నవారిని ఆశ్రమంలో చేరుటకు అనుమతి ఇచ్చేవారుకాదు. కాని రాను రాను ఆశ్రమంను ఆశ్రయించి సాధన చేయువారి సంఖ్య పెరిగినది. కొందరు కుటుంబంతో వచ్చి ఆశ్రమంలో ఉండేవారు. వారి పిల్లల భవిష్యత్తు నిమిత్తం అరవిందులవారు ఆశ్రమం ఒక రాజకీయ సంస్థకాదు, ఆశ్రమంలో ఉండువారిలో చాలామంది రాజకీయాలు ప్రవేశించి దానిని వదిలి బయటకు వచ్చినవారే. ఆశ్రమం ఒక మత సంస్థకాదు. అన్ని మతములవారు ఇక్కడ ఉన్నారు. ఎలాంటి మత సిద్ధాంతాలు లేవు. ఎవరి నమ్మకాలు వారివి. సత్యాసత్యములను గ్రహించుట, కోరికలను అదుపులో ఉంచుకొనుట, మానవునిలో దాగిఉన్న చైతన్యమును మేల్కొలుపుట, ఏకాగ్రత ధ్యానమందు ఉండుటకు మొదలగు

అంశాలకు సంబంధించిన విషయాలను అరవిందులవారు ఉపదేశాలు ఇస్తుండేవారు.

ఈ ఆశ్రమం మిగతా ఆశ్రమములా కాదని, ఇందులో సన్యాసులు, గృహస్థులు, అనాధలు ఎవరైనా ఉండవచ్చని, ఈ ఆశ్రమం ఒక నూతన ఒరవడికి శ్రీకారం చుడుతుందని అరవిందులవారు పేర్కొన్నారు.

ఈ ఆశ్రమంలో ఉండటానికి ఎలాంటి అర్హతలు ఉండనక్కర్లేదని, స్త్రీ, పురుష, వర్ణ భేదం లేదని, యువకులు, వృద్ధులు, అని ఎలాంటి వయస్సు భేదం లేదని, ఎవరైనా అరవిందులవారి ఇష్టానుసారంగా ఆశ్రమంలో ఉండవచ్చు. అరవిందులవారు ఎవరిని నిరాకరిస్తారో, ఎవరిని అనుమతిస్తారో అది కేవలం అరవిందులవారికి మాత్రమే తెలియును. బాహ్యస్థితిగతుల ఆధారంగా కాక, అంతరస్థితులను అరవిందులవారు గమనించి, గ్రహించి వారికే ఎక్కువగా ఉండటానికి అనుమతించేవారని తెలుస్తున్నది. యోగాయందు యోగ్యత ఉన్నవారికి అరవిందులవారు ఎక్కువగా ఇష్టపడేవారు. ఇలాంటి ధర్మములు ఉన్న ఆశ్రమంలో దాదాపు 700 మంది ఉండేవారు. అందులో స్త్రీలు 200 మంది. అందులో ఉన్నారు. దేశములో ఉన్న అన్ని రాష్ట్రములకు సంబంధించినవారు

ఉన్నారు. ఎక్కువమంది పశ్చిమ బెంగాల్‌కు చెందినవారు ఉండేవారు. అటుపై గుజరాతీయులు ఎక్కువగా ఉండేవారు. భారతదేశానికి వచ్చిన తరువాత 13సం॥ బరోడాలో ఉన్నకారణమేమోగాని గుజరాతీయులు ఎక్కువగా ఉండేవారు. ఆశ్రమం దక్షిణప్రాంతంలో ఉన్న కారణంగా దక్షిణ ప్రాంతానికి చెందినవారు తక్కువగానే ఉండేవారు. భారతీయులే గాక యూరోపు, అమెరికా దేశీయులు స్త్రీ, పురుషలు ఎక్కువగా ఉండేవారు. ఆశ్రమంలో అన్ని మతాలవారు ఉన్న ఏమత సాంప్రదాయాలు పాటించబడవని అరవిందులవారు తమ శిష్యులకు చెప్పేవారు.



పిల్లలకోసం ఒక విద్యాలయం స్థాపించారు. 100కు పైగా బాలబాలికలు ఆవిద్యాలయమునందు విద్యను అభ్యసించేవారు. ఫ్రెంచి, ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ, బెంగాలీ, గుజరాతీ, గణితం, రసాయనశాస్త్రం, భౌతిక శాస్త్రం మొ॥ భోదించేవారు. ఆట పాటలకు కూడా మంచి శిక్షణ ఇచ్చేవారు. ఆవిద్యాలయానికి ప్రభుత్వానికి ఎలాంటి సంబందం ఉండేది కాదు. ఆశ్రమమే ప్రజాసంస్థ కానప్పుడు ఆశ్రమానికి సంబందించిన వాటికి అసలు ఏహక్కు ఉండదు.

15 సెప్టెంబర్ 1960లో తూర్పు ఆఫ్రికాకు చెందిన ప్రసిద్ధ వ్యాపారి లాలాజీభాయి హిందూజా ద్వారా స్థాపించబడ్డ న్యూ హారిజన్స్ మిల్స్ అన్న పంచదార ఫ్యాక్టరినీ ప్రారంభించాడు. లాలాజీ పాండిచ్చేరిలో ఒక ఫ్యాక్టరి స్థాపించడానికి అనుమతికోరాడు. దానికి బదులు పంచదారా ఫ్యాక్టరీ ప్రారంభించమని శ్రీమాత చెప్పింది. 1956లో ఆయనకు ఫ్యాక్టరీ ప్రారంభించమని అనుమతి లభించింది. రైతుల సహాయంతో 6500 ఎకరాల్లో చెరకు పంట ప్రారంభించారు. ఆ ఫ్యాక్టరికి సక్రూర్ షుగర్ ఫ్యాక్టరీ అని పేరు పెట్టింది. డిసెంబర్ 1న ఈ ఫ్యాక్టరీ ప్రారంభమైంది. ఈ రెండు పరిశ్రమలు ఆశ్రమవాసుల అధీనంలో ఉండేలా శ్రీమాత చేసింది.

ఇలా ఎందరికో ఉపయోగపడే పనులు చేసి ఆశ్రమాన్ని ముందుకు తీసుకెళ్తున్నది శ్రీమాత.



శ్రీ అరవిందులవారు



12-2-56

Opening of the Sri Aurobindo Ashram
Delhi branch

Let this place be worthy of its name and manifest the true spirit of Sri Aurobindo's teaching and message to the world.

With my blessings

ఆశ్రమం ప్రారంభసందర్భములో
శ్రీ అరవిందులవారు తమ లేఖ ద్వారా తెలిపే శుభాకాంక్షలు

# 15. శ్రీ అరవిందుని రచనలు



శ్రీ అరవిందుల వారు స్వానుభవాలను పుస్తకరూపంలో తీసుకువచ్చి, తనలో చిన్నతనం నుంచి ఉన్న సాహిత్య ప్రతిభను ప్రపంచానికి చాటారు.

శ్రీ అరవిందుల రచనా మాధుర్యం వర్ణించశక్తి ఎవ్వరికీ సరిపోదు. జీవితపు అన్ని దశలను ఆయన తన రచనలలో వర్ణిస్తూ ఆయన చేసిన సాహిత్యపు ప్రయోగం అమోఘం.

శ్రీ అరవిందులవారు తమ స్వఅనుభవాలతో రచించిన రచనలు ఎందరికో స్ఫూర్తిదాయకంగా నిలుస్తున్నవి. తన జీవితమే ఎందరికో స్ఫూర్తిదాయకం, ఆదర్శనీయం. సావిత్రి పుస్తకంలో తన అనుభవాలను, వర్ణిస్తూ శ్రీ అరవిందులవారు చేసిన రచన అమోఘం, అద్భుతం. మానవుని సత్యలోకములో ఉంచిన మహాకావ్యం సావిత్రి.

శ్రీ అరవిందుల వారిలో దాగివున్న అంతరిక ఆధ్యాత్మికతకు నిదర్శనమే సావిత్రి మహాకావ్యం. భారతదేశంలో ఉన్న గొప్ప రచనలలో వాల్మీకీ రామాయణం, వ్యాస మహాభారతం, శ్రీకృష్ణ భగవద్గీత లాగా శ్రీ అరవిందుని సావిత్రి ఉంటుంది.

శ్రీ అరవిందుని కల్పనాశక్తికి రూపవమే సావిత్రి. శ్రీ అరవిందుని అనుభవసారమే సావిత్రి. ఎంతో కఠినంగా శ్రీ అరవిందులవారు చేసిన సాధన ఫలితమే సావిత్రి. తనదైన సాహిత్యపు విలువలను పాటిస్తూ పాఠకులను మంత్రముగ్ధుల్ని చేసే పుస్తకమే సావిత్రి. శ్రీ అరవిందుల వారికి చిన్నతనం నుంచి పుస్తకాలంటే ఎంతో

ఇష్టం. చిరిగిన బట్టలు మార్చుకుండా, కొత్తబట్టల బదులు కొత్త పుస్తకాలు కొన్న మహానుభావుడు శ్రీఅరవిందులవారు. తాను విదేశాలలో ఉన్నప్పుడు తన రచనలు చూసి ఎందరో ఆశ్చర్యపోయారు. ఎంతో అనుభవం ఉన్న పండితుడిలాగా పసితనంలోనే ఎంతో గొప్ప రచనలు చేయటం ఎందరినో ఆశ్చర్యపరిచింది.

తాను బరోడాలో ఉన్నప్పుడు కాని, కలకత్తాలో గడిపినప్పుడు గాని, ఎక్కడ ఉన్నా తన పుస్తక పఠనం, రచనలు వదులుకోలేదు శ్రీ అరవిందులవారు.



శ్రీ అరవిందుల వారు కేవలం పుస్తక రచనలే కాదు. ఎన్నో పత్రికలకు వ్యాసాలు, శీర్షికలు రచించి ఎందరో విమర్శకుల విమర్శలకు గురి అయ్యారు. నిజాన్ని నిర్భయంగా చెప్పే తత్త్వం శ్రీ అరవిందుల వారిది. స్వాతంత్ర్య పోరాటంలో భారతదేశంలో జరుగుతున్న రాజకీయ సంఘటనలకు స్పందిస్తూ ఎందరినో తన వ్యాసాలతో శత్రువులను, మిత్రులను ప్రోగుచేసుకున్నారు శ్రీ అరవిందులవారు.

శ్రీ అరవిందులవారి ఘాటు రచనాస్థాయిని తప్పుపట్టినవారు ఎందరో. ఎందుకంటే వారిని గూర్చి, వారు చేసే తప్పుడు పనులను ప్రజలముందుకు తన రచనలతో తెచ్చినందుకు.

శ్రీ అరవిందులవారు 'వందేమాతరం' 'ఆర్య' ఇలా కొన్ని పత్రికలను స్వయంగా నడిపినారు. పత్రికలో కేవలం రాజకీయ

సంబంధిత విషయాలే కాక, విద్యా, ఆధ్యాత్మిక, ఆటపాటల గూర్చి కూడా తన పత్రికలో ముద్రించేవారు.

తన రచనలతో ఎందరినో ప్రభావితం చేశారు శ్రీ అరవిందులవారు.

తాను జీవించి ఉన్నప్పుడే తన జీవిత చరిత్రను ముద్రింపచేయాలన్నది తన అనుచరుల అభిమతము.





శ్రీ అరవిందులవారి రచనలు

1950లో శ్రీ అరవిందుల వారి ఆరోగ్యం క్షీణించింది. ఈ శరీరం ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చుకుంది. ఎందరికో ఆదర్శప్రాయంగా నిలిచింది. ఎందరినో మిత్రులను చేసింది. కొందరిని శత్రువులను కూడా చేసింది. శ్రీమాత అందించు సహాయసహకారాలు శ్రీ అరవిందుల వారికి తన యోగసాధనకై ఎంతో ఉపయోగపడింది. ఇంకా తన చివరి రోజుల్లో దాదాపు తన శక్తిని శ్రీమాతకు అందించి తాను ఈ భూమి మీదకు వచ్చి ఈశ్వరానుగ్రహం అందించినంతవరకూ సేవ చేసి భారతదేశం ఋణం తీర్చుకొని, ఎందరికో ఆదర్శమహనీయునిగా నిలిచి డిసెంబర్ 5, 1951 నాడు ఆ పరమేశ్వరునిలో ఐక్యమైపోయారు!



గురువుగారు భౌతికంగా లేకపోవటం వల్ల శ్రీమాత ఒక రకంగా బాధపడినా, వారి మధ్య ఎప్పుడూ అంతరంగకంగా సమాచారం ఇచ్చి పుచ్చుకుంటున్నారన్న భావం వల్ల శ్రీమాత కుంగిపోలేదు. అయినా గురువులేని తోడు, ఆమెలో, ఆశ్రమంలో కొట్టొచ్చినట్లు కనిపించింది. గురువే శ్రీమాతకు బలం, బలహీనత. ఇప్పుడు బలం, బలహీనత ఏకమై ఒక శక్తిగా మారి శ్రీమాతకు ఆ శక్తిని ధారపోసి తాను భౌతికంగా సెలవు తీసుకున్న మహనీయుడు శ్రీ అరవిందులవారు.

శ్రీఅరవిందులవారి పార్థివశరీరాన్ని మూడురోజుల పాటు ప్రజల సందర్శనార్థం పెట్టారు. అయినా వారి శరీరం నుండి

పరిమళాలు వెదజల్లుతూనేవున్నాయి. శ్రీమాత మౌనంలోకి వెళ్ళిపోయింది.

ఇన్నాళ్ళు గురువు అందించిన శక్తిని మళ్ళీ ఉత్పన్నం చేసుకుంటూ గురుప్రార్థనలో ఉండిపోయింది.

శ్రీమాత ఆశ్రమ సన్నిధిలోనే శ్రీగురువర్యులు, పూజనీయులైన శ్రీ అరవిందులవారిని మహాసమాధి చేసింది. ఆ కట్టడంపై తన మనస్సులోని భావాన్ని వ్రాయించింది. అది క్రింద చెప్పటం జరిగింది.

" ఈ పార్థివ ఆవరణ శ్రీగురుదేవుల చైతన్యమే.
మేమంతా మీకు అత్యంత కృతజ్ఞులం.
మా కోసం మీరెంత సంఘర్షణ చేశారు !
ఎన్ని కష్టాలు భరించారు.
ఎన్ని స్వప్నాలు చూచారు.
ఎంతటి సహనం పాటించారు.
మా కోసం మీరు ఎంత కృతనిశ్చయులై,
ఎన్ని లెక్కలేనన్ని ప్రయాసలు చెందారు.
ఎంత సాధన చేశారు.
మేము మీ ముందు నతమస్తకులమై ప్రతిక్షణం మీ

ఋణాన్ని స్మరిస్తూ మీ ఆదర్శంలో నడుస్తాం.

ఇదే మా ప్రార్థన !

ఇదే మా నివేదన !

శ్రీ అరవిందుల నిర్యాణం తరువాత ఆశ్రమబాధ్యతలే కాకుండా నవ మానవ సమాజ నిర్మాణం కోసం శ్రీమాతగారు ఎంతో కృషిచేసింది. ఎక్కడ ఏ సమస్య రాకుండా, అందరిని ఒకే బాటలో నడిపిన మహనీయురాలు శ్రీమాత.



చివరిరోజులలో శ్రీ అరవిందులు



1950వ సం॥లో శ్రీ అరవిందులవారు



చివరిరోజులలో శ్రీ అరవిందులు



1950వ సం॥లో శ్రీ అరవిందులవారు



చివరిరోజులలో శ్రీ అరవిందులు



చివరిరోజులలో శ్రీ అరవిందులు



శ్రీ అరవిందులవారి మహాసమాధి





శ్రీ అరవిందులవారి మహాసమాధి

శ్రీ అరవిందుల వారు మహాసమాధి చెందటం వల్ల శ్రీమాతగారి మీద భారం పడిపోయింది. అది ఎలాంటి బాధ్యత భారం అంటే ఆధ్యాత్మికంగా తాను శ్రీ అరవిందులవారి ఆశయాలను ఎలా ముందుకు తీసుకువెళ్ళాలో ఆ బాధ్యత. శ్రీ అరవిందులవారు లోకంలో ఉన్న, భౌతికంగా లేకున్న, శ్రీ మాత మీద సదా తన ఆశీస్సులు ఉండేవి. శ్రీ అరవిందులవారికి ముందే తెలుసు శ్రీమాత యొక్క గొప్పతనం, నైపుణ్యం, సేవాభావం, బాధ్యత తీసుకునే గుణం. అందుకే కాబోలు తన జ్ఞానశక్తిని శ్రీమాతతో పంచుకున్నారు శ్రీ అరవిందులవారు.



ఎందరికో ఇప్పటికి స్వప్నదర్శనం ద్వారా, సమస్యలను పరిష్కరిస్తూ ఈశ్వరానుగ్రహ ప్రాప్తి కొరకు సహాయం చేస్తూ తమ భక్తులకు, అనుచరులకు నమ్మకాన్ని స్థిరంగా ఉంచుతున్నారు శ్రీ అరవిందులవారు.

శ్రీ అరవిందులవారి జ్ఞానశక్తిని ఆధ్యాత్మికతను తన శిష్యులు, అనుచరులు శ్రీ అరవిందులవారి ఆజ్ఞానుసారంగా ముందుకు తీసుకెళ్తున్నారు.

శ్రీ అరవిందుల వారి మహాసమాధిని నుంచి ఎందరికో ఎన్నో ప్రశ్నలకు పరిష్కారం దొరుకుతున్నది. ఆ భూమి పుణ్యభూమి.

అక్కడకు మనం వెళ్ళటమే మన పూర్వజన్మ సుకృతం. ఆ మహనీయుని గొప్పదనం తెలుసుకుంటూ రోజురోజుకు పాండిచ్చేరిలోని అరవింద ఆశ్రమమునకు వచ్చే వారి సంఖ్య పెరుగుతూ ఉంది.

శ్రీ అరవిందులవారి ముఖంలోని తేజస్సు, కళ్ళలోని కాంతి, తన తపోశక్తితో ఎందరికో చూపుతోనే జ్ఞానం ప్రసాదించిన, మూర్తిభవించిన అవతారం శ్రీ అరవిందులవారు.

ఆశ్రమపు బాధ్యత కాని, శిష్యుల భారంకాని, తనకున్న నైపుణ్యంతో శ్రీ అరవిందులవారి మహాసమాధి అనంతరం ఎంతో చక్కగా నిర్వహించింది శ్రీమాత. తన చివరి శ్వాస వరకు ఆశ్రమాన్ని ఒక ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దారు.



ఈ రోజుకు కూడా శ్రీ అరవిందులవారు రచించిన గ్రంధాలు, పుస్తకాల మీద పరిశోధన చేస్తూ వారు ఈ భూమికి అందించిన దివ్యజ్ఞానశక్తిని ప్రజల ముందుకు తెస్తున్నారు పరిశోధకులు.

భక్తిమార్గాన్ని దాటిన వారే జ్ఞానమార్గంలోకి ప్రవేశిస్తారు. అలా వారి వారి జీవితాల్లో అంచెలు అంచెలుగా తమ ఆధ్యాత్మికశక్తిని, జ్ఞానాన్ని పెంచుకుంటూ, ఈశ్వరానుగ్రహానికి ప్రసన్నులౌతారు.

శ్రీ అరవిందుల వారు జన్మించి, తరింపచేసిన ఈ

పవిత్రభూమి మీద మనం పుట్టడమే గాక ఆ మహనీయుణ్ని తలవటమే మన పూర్వ జన్మ సుకృతం. తాను భౌతికంగా లేకున్నా అంతర్లీనంగా ఎందరితోనో ఉంటూ, ఎందరినో జ్ఞానమార్గంలో శిఖరాగ్రానికి తీసుకెళ్తూ సజీవంగా శ్రీ అరవిందులవారు ఉన్నారు.



శ్రీ అరవిందులవారి చిత్రపటం




భారత ప్రభుత్వం శ్రీ అరవిందుల జ్ఞాపకార్థం
ముద్రించిన స్టాంపు



భారత ప్రభుత్వం శ్రీ అరవిందుల జ్ఞాపకార్థం

ముద్రించిన స్టాంపు



1965లో శ్రీమాత ఆరోవెల్లి (ఉషానగరి)కి భావ్యకల్పన ప్రస్తావన ప్రపంచానికి తెలియచేసింది.

**ఆరోవెల్లి (ఉషానగరి) యొక్క ముఖ్య ఉద్దేశం :**

భారతీయ జ్ఞానం ప్రపంచసమాజాల్లో ప్రకాశించటానికి, సంస్కృతి గొప్పదనం, యోగశక్తి విశిష్టత, ఆధ్యాత్మికత లోని రహస్యం తెలిపే పవిత్రభూమే ఈ ఆరోవెల్లి (ఉషానగరి). శ్రీమాత కల్పనా భావాలకు రూపమే ఆరోవెల్లి. 25 కిలోమీటర్ల వ్యాసంగల చక్రాకార నగరి కేంద్రస్థానంలో గల మాతమందిరం చక్రంలో 4 భాగాలు వరుసగా నివాసాలు, కార్యక్రమశాలలు, సంస్కృతి, అంతర్ రాష్ట్రీయ వ్యవహారవేదిక ...ఇలా వివిధ భాగాలుగా విభజించబడినది. ఈ చక్రాకార రూపానికి ప్రధానమైనది మాతమందిరం.

**ఈ మాతృ మందిరపు గొప్పదనం :**

మానవ కోరికలను సిద్ధింపచేసే మార్గం.

చిత్ శక్తి యొక్క మూల స్థానం.

మానోవికాసానికి అంతర్గుహం.

ఇలా ఎన్నో విశిష్టతలకు రూపాంతరమే ఆరోవెల్లి.

దాదాపుగా 2000 ఎకరాల్లో ఉన్న ఈ నగరం 25 ఎకరాల్లో కేవలం చక్రాకార రూపంలో మాత మందిరం మరియు వేరే గృహాలు

ఉన్నాయి.

ఈ ఉషానగరి 1968 ఫిబ్రవరి 28వ తేది శ్రీమాత చేతులమీదుగా భూమి పూజ జరిగింది. 121 దేశాల నుంచి ఆరోవెల్లి భూమి పూజకు వచ్చారు. మన భారతదేశంలో గల 23 రాష్ట్రాల నుంచి కూడా ఈ భూమిపూజకు వచ్చారు. ఆరోవెల్లిలో ఒక ప్రాంతంలో కుంభం ప్రతిష్ఠించబడినది. ప్రతిదేశం నుంచి, భారతదేశంలో గల భిన్న ప్రాంతాల నుంచి వచ్చిన ప్రతివారు వారి వారి ప్రాంతాల మృతికను వారి వెంట తెచ్చారు. పవిత్ర మృత్తికలను ఆ కుంభంలో వేసినారు. ఆ సందర్భంలో శ్రీమాత ఉప్పొంగిపోయి, సభాపరంగా పలికిన మాటలివి.



"ఉషానగరి అందరికి నమస్కారం తెలుపుతున్నది. ప్రగతి ఆకాంక్షగా ఉత్తమమైన సత్యమార్గంలో అభిప్రేత జీవనాన్ని గడపాలన్న కోరికగల అందరికి స్వాగతం, సుస్వాగతం! ఈ ఉషానగరి ఏ ఒక్కరి అధీనంలో ఉండదు. ఇది సర్వమానవజాతికి సంబంధించింది. ఇది ఒక శిక్షణాకేంద్రం. అందరి ప్రగతి కోరుతూ ప్రగతివైపు సాగిపోయే నగరి. భౌతిక, ఆధ్యాత్మిక ప్రయత్నాలకు ఈ ప్రాంతం ఒక ప్రయోగశాల. సమస్త మానవాళికి ఈ ఉషానగరం అంకితం. ఈ జ్ఞానాన్ని పెంచుకోవడానికి, మీ మేధాశక్తిని

కల్పనాభావం పెంపొందించడానికి ఈ నగరం ఎంతో మేలు చేస్తుంది అని ఎంతో భావోద్యంతో శ్రీమాత తన ప్రసంగాన్ని పూర్తి చేసింది.



ఆరోవెల్లికి భూమిపూజ జరిగిననాడు తీసిన ఛాయాచిత్రం



ఆరోవెల్లికి భూమిపూజ జరిగిననాడు తీసిన ఛాయాచిత్రం



ఆరోవెల్లి నిర్మాణం తెలియజేయు ఛాయాచిత్రం

# 19. పాండిచ్చేరి – ఆరోవెల్లికి చేరు మార్గము



1. అరవింద జీవితం - చతుర్వేది వెంకట కృష్ణయ్య

2. ది లైఫ్ ఆఫ్ శ్రీ అరబిందో - ఎ.బి. పురాని

3. శ్రీ అరవింద దర్శనం - శ్రీ శార్వరి

4. సావిత్రి - శ్రీ శార్వరి





ఒక మహాత్ముని గూర్చి తెలుసుకోవాలంటే,
ఆయన జీవితం తెలుసుకోవలసిన అవసరం లేదు.
ఆయన చెప్పిన ఒక మాట, చూపిన బాటచాలు.
ఆ మాటే ఆశయానికి మూలం, ఆ మార్గమే జీవితానికి గమ్యం.



Start by doing what's necessary
Then do what's possible and
Suddenly you are doing the impossible

చరణ్ జనమంచి